

# గీ తా మా లం.

## శ్రీ వి నో బా భా వే.

దక్షిణ భారత హిందీ ప్రచారసభవారిచే
అనువదింపబడినది.

ప్రకాశకులు
నిర్మాణ కార్యక్రమ కేంద్రము
జొన్నలగడ్డ.
1942.

కౌముదీ ముద్రాక్షరశాల,
నరసరావుపేట.

# మ న వి.

శ్రీ వినోబాభావే క్రిందటిసారి జైలులో వుండగా సంపూర్ణ స్వానుభవంతో కూడిన భగవద్గీతోపన్యాసములు రెండు వ్రాసియుండిరి. వానిని అనువదించి దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు మా కొసంగిరి మొదటి రెండు అధ్యాయములే యగుటచే గీతాధ్యాయములన్నియు ఒక్కమారే ప్రచురించుదమను ఉద్దేశ్యముతో శ్రీ వినోబాగారు మద్రాసు రాగా వారినచ్చట కలిసికొని మాయొక్క కోరిక విన్నవించితిమి. కాని వారు ప్రస్తుతము మిగిలిన అధ్యాయములు తయారు చేయుటకు అవకాశము లేదనిన్ని, యింతవరకు "గీతా మూలం" అను పేరుతో ప్రకటించుకోవలసినదనిన్ని అనుజ్ఞయిచ్చియుండిరి. ఇదివరలో "గీ తా ప్ర వే శి క" అను చిన్ని పొత్తమును ప్రచురించియుంటిమి. తరువాత "గీతామూలం" కూడ సాధకులకు చాల ప్రయోజనకారి కాగలదని సంతసించుచున్నాము.

శ్రీమన్నారాయణ 'అగ్రవాలు'గారి వ్యాససహాయంతో శ్రీ వినోబాగారి జీవిత సంగ్రహం చేర్చి మాకెంతో సహాయపడిన దక్షిణభారత హిందీప్రచారసభవారికిన్ని, అడిగినవెంటనే తొలిపలుకు వ్రాసియిచ్చిన శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికిన్ని మావందనములు.

జొన్నలగడ్డ, 22—8—42. ఇట్లు,
ప్ర కా శ కు లు.

# తొలిపలుకు.

పూజ్యులైన శ్రీ వినోబాభావేగారి గీతార్థాన్ని లేటతెలుగులో ప్రకటించడం ఎంతో ముఖ్యమైనపని. ఇందుకు పూనుకున్న మిత్రులు ధన్యులు. గీతలోని శ్లోకాల ప్రతిపదార్థమూ, శంకరాది భాష్యకర్తల అభిప్రాయాలు చక్కగా వివరించిన గ్రంథాలు అనేకం ఉన్నవి. కాని శ్రీ వినోబాభావే సంపూర్ణంగా స్వానుభవంమీదనే ఆధారపడి, అనుక్షణమూ గీతామార్గాన సంచరించే సాధకులు తక్కువగదా! అందువల్లనే వారి సందేశం ప్రత్యేకంగా ప్రశంసింపతగ్గది.

జీవితపథంలో నిత్యమూ మనకు కలిగే సంశయాలను ఛేదించి, ఎప్పటికప్పుడు రాచబాట వేయగల శక్తి గీతలోవున్నది. ఎవరి సంస్కారాన్నిబట్టి, చిత్తవృత్తినిబట్టి, వారు గీతలను బోధపరుచుకో గలుగుతున్నారు. గంగాప్రవాహంలో నీరు ఎంత లోతుగా ఉన్నా, మనం ఉపయోగించే పాత్రను అనుసరించే మనకు నీరు ప్రాప్తిస్తుంది ఎప్పటికప్పుడు గీతాశ్లోకాలను పఠించి, నెమ్మదిగా సావకాశంగా వాటిని మననం చేసి శ్రీ వినోబావారి స్వానుభవంలోకి తెచ్చుకోవడం ఉత్తమపద్ధతి.

ప్రస్తుతం మొదటి రెండు అధ్యాయాల మీది వ్యాఖ్య మాత్రమే ప్రకటించదమైనది. కాని, వీటిలో శ్రీ వినోబాగీతా సందేశాన్నంతా క్లుప్తంగా తెలియపరి చాడు "విషాదయోగం" లోని అంతరార్థం, స్వధర్మ పరధర్మముల నిర్వచనం, స్థితప్రజ్ఞుని లక్షణాలు. అద్భు తంగా చెప్పినాడు ముముక్షువులు ఈ గ్రంథాన్ని శ్రద్ధ తో పఠించి. "కర్మను ఆచరించడం లో గల కౌశలమే యోగము" అన్న పరమార్థమును గ్రహింతురు గాక! మన హృదయంలో నివసిస్తూ, మనకు ఎల్లప్పుడూ తోడు నీడయై, మనజీవిత రథానికి సారథియైన శ్రీకృష్ణుడే ఇందుకు తోడ్పడగలడు. అర్జునుడు తనకు ప్రీతిపాత్రుడు కాబట్టి ఆప్తవాక్యంగా అతనికి గీతను బోధించా నం టాడు. అర్జునుడు ఒక్కడే నన్నమాట ఎందుకు మన మంతా అతనికి ఆప్తులమే. మనము నిశ్చలబుద్ధితో తలు చుకుంటే చాలు, తన ప్రేమరశ్మివల్ల, మనహృదయ పద్మాలను వికశింప చేస్తాడు.

నేను తత్వవేత్తను కాను, సాధకుడనూ కాను. భారతీయ విజ్ఞానానికి గీత శిఖరం వంటిది. దానిపైగల భక్తికొద్ది నాలుగుముక్కలు వ్రాశాను.

నరసరావుపేట, } కోలవెన్ను రామకోటేశ్వరరావు.
౨౦-౮-౪౨

# ఆచార్య శ్రీ వినోబా భావేగారి జీవిత సంగ్రహం.

పేరు ప్రతిష్ఠలకు ప్రాకులాడక నిరంతరం ప్రజా సేవలో జీవితాన్ని వినియోగించడమే శ్రీ వినోబావే యొక్క జీవనాదర్శము. నలుగురిలో తానొకడినని అని పించుకుంటామనే భావం ఆయనలో వెతికినా కన్పించదు. అందుకనే గాంధిగారు ఆయన్ని ప్రథమ సత్యాగ్రహిగా ఎన్నుకునేవరకు చాలామంది ఆయన పేరుకూడా ఎరు గరు. గాంధిమహాత్మునికి ఆయన కుడిభుజం. వారి నిర్మాణకార్యక్రమానికి వినోబా కృషిచాలా తోడ్పడింది. ఒక్కమాటలో చెప్పాలంటే. మహాత్ముడు ఆయనను ఒరిపిడిరాయిగా వుపయోగించుకుంటాడని చెప్పాలి. ఖద్దరు వ్యాప్తినిగురించి కానీయండి. హిందూ మహ మ్మదీయ ఐక్యతనుగురించి కానీయండి, వర్ధావిద్యావిధా నం కానీయండి. మహాత్ముడు ఏదితలపెట్టినా దానిని అమలుపరచడానికి ముందు వినోబా ప్రయోగించి చూచి సముచితే గాంధిగారు ప్రజా సమూహానికి వెల్లడి చే స్తారు. ఆయన జీవితం ప్రయోగాలకు కూడలి. ఎన్నో ప్రయోగాలు, ఎన్నో క్రొత్త పద్ధతులు ప్రారంభించి,

శరీరాన్ని అరగదీసి మేలిమి చేసుకున్నాడు. ఆయన్ని చూస్తే మన పురాణ యుగములోని ప్రాచీన ఋషి సంప్రదాయం జ్ఞాపకం వస్తుంది. ఆయన నిరాడంబర జీవితం, సూక్ష్మబుద్ధి. భావగభీరత, చాతుర్యం వర్ణనాతీతం కర్మయే కొలికి పూసగా పెట్టుకుని, జీవిత లక్ష్యాన్ని సాధించబూనిన కర్మయోగి. జీవిత మార్గం గోచరించక అంధకారంలో తడుములాడే ప్రపంచానికి- ముఖ్యంగా భారతదేశానికి రాచబాటను చూపగల జ్ఞానమూర్తి, వేదపురాణాదులు సాకల్యంగా పఠించి జీర్ణించుకున్న తత్వవేత్త, ఎంతటిచిక్కు సమస్యలనైనా విడదీసి తేలికగా ప్రజాసముదాయానికి బోధించగల ప్రజ్ఞానిధి, మహాత్ముని జీవితోద్దేశ్యాలను శాస్త్రీయంగా, చాకచక్యంతో బోధించి ప్రజలను ఆ వైపుకు ఆకర్షింపగల మనీషి.

శ్రీ వినోబా బొంబాయిరాష్ట్రంలో కొలాబా జిల్లాలో "గా గో దే" అనే గ్రామంలో జన్మించాడు. ఆయన చిన్నతనమంతా, తండ్రితో కూడ బరోడాలోనే గడిచిపోయింది. చాలా కాలం తండ్రియే విద్యచెప్పేవాడు. కొంతకాలం అయిన తర్వాత ఒక విద్యాలయంలో చేరినాడు. తనకొడుకు ఏవైనా కళలలో ప్రవీణుడు కావాలని తండ్రి కోరుతూ వుండేవాడు. అందుకే చిత్ర

కళలో ఎక్కువ కృషిచేయించాడు. కాని వినోబా మన సు ఇంకెక్కడో వుండేది. అప్పుడే వంగరాష్ట్ర విభజన జరిగింది. అందుకు ఫలితంగా కలిగిన అలజడి మహా రాష్ట్రంలోకూడ మారుమూలలకు ప్రాకింది. శివాజీ ద్వారా రాష్ట్ర నిర్మాణానికి పునాదులు వేయించిన సమ ర్థ రామదాసుయొక్క బ్రహ్మచర్య మహిమ అనేక మంది మహారాష్ట్ర యువకుల్ని ఆకట్టింది. దేశాన్ని అధోగతినుండి పైకి తీసుకురావలెననే కోరిక వారిలో ప్రబలమైంది. వెంటనే వినోబా చిన్నతనమందే బ్రహ్మ చర్యం స్వీకరించాడు. అప్పటినుంచి బ్రహ్మచర్యం ఏదేక దీక్షతో పాలిస్తున్నాడు.

వినోబా మొదట్లో రాజకీయాల్లోకూడా ప్రవేశిం చాడు. తిలకు మహాశయుని భావాలు ఆయన్ని చాలా వరకు ఉద్రేక పరచినాయి. దానికి ఫలితంగా విప్లవ భావాలు ఆయనలో రేకెత్త నారంభించినాయి చిన్న ప్పుడు వినోబాది కొంచెం కోప స్వభావం. గణితం అంటే ఆయనకు అభిమానం. తరగతిలో ఎప్పుడూ ముందు వుండేవాడు. కొడుకు తెలివితేటలు చూచి, తండ్రి ఎప్పుడూ కొడుకు గొప్ప పట్టభద్రుడయి ప్రవీణుడవు తాడని ఉవ్విళ్లూరుతూవుండేవాడు. కాని వినోబా జీవిత చర్య దినదినం ఇంకొక త్రోవ పట్టనారంభించింది

అధ్యాత్మ చింతన అంటే ఎక్కువ ఆసక్తి. ప్రాపంచిక విషయాలమీద ఏవగింపు ప్రారంభమయింది. పాఠశాలలో చెప్పే చదువుమీద మనసు నిల్పక, ప్రాచీన మరాఠీ వాఙ్మయం, ధర్మగ్రంథాలు చదవడంలో మునిగిపో నారంభించాడు. మొదట్లో ఆయన సంస్కృతం నేర్చుకోలేదు. దానికి బదులు ఫ్రెంచి చదివాడు. కాని మరాఠీ వాఙ్మయంలో పారంగతుడు కావడంచేత తర్వాత సంస్కృతం బహు తేలికగా నేర్చుకున్నాడు. తిలకు మహాశయుని గీతా రహస్యం అచ్చుపడుతున్నదనే విషయం ఆయన చెవిని పడింది. వెంటనే సంస్కృత జ్ఞానం వృద్ధిచేసికో నారంభించాడు. కొద్దిరోజుల్లోనే సంస్కృత భాషలో పూర్తి పాండిత్యం ఆయనకు అబ్బింది.

గీతా పఠనంలోకి దిగినతర్వాత ఆత్మాన్వేషణ తీవ్రమయింది. మనసులోని అలజడి మరింత ప్రబలమయింది. ఇంటిదగ్గరవుండి తృప్తిదీర జ్ఞానాన్ని ఆర్జించడం దుస్సాధ్యమనిపించింది. ఇల్లువదలి బయటికి పోతేనేగాని వీలులేదనుకున్నాడు వినోబా చేష్టలు తండ్రికి కష్టం కలిగించాయి. ఇంటరు మీడియట్ పరీక్షలో కూర్చోపెడానికని వినోబా బరోడానుండి బొంబాయి వెళ్ళాడు. కాని పరీక్షమీద దృష్టివుంటేగా! తిన్నగా కాశీ చేరుకున్నాడు. అక్కడ కొన్నాళ్ళు సంస్కృతంలో

ఎన్నో ధర్మగ్రంథాలు పఠించాడు. ఇబ్బందులుకూడ చాలా ఎదుర్కొనవలసివచ్చింది. అయినా అంతరాత్మకు శాంతి లభించలేదు. సన్యాసం స్వీకరించి హిమాలయాల్లో తపస్సు చేసుకుందామనే దృష్టి ఆయన కెప్పుడూలేదు. దేశానికి ఉపకరించే పని ఏదైనా చెయ్యాలి- ఇదే దివారాత్రులు ఆయన మనసులోని కోరిక. ఈ తరుణంలోనే గాంధిమహాత్ముని నామం ఆయన చెవిని పడింది గాంధీగారి అభిప్రాయాలు, కార్యపద్ధతి వినోబాకు నచ్చాయి. వెంటనే సబర్మతీ ఆశ్రమంలో తననుకూడ చేర్చుకోవలసిందని దరఖాస్తు పంపుకున్నాడు. జవాబుకు వేచివుండకుండానే సబర్మతి వెళ్ళి చేరుకున్నాడు. ఆశ్రమమైతే ధరించింది, కాని ఆ అనారోగ్యపు శరీరాన్ని చూచి ఎవరూ అంతగా ఆయన్ని గణించలేదు. ఆశ్రమ నియమాలు చాలా కఠినంగా వుండేవి. శరీరకష్టం అంతా చేసి తీరాలి. వినోబాకు నీళ్ళతోడే పనిఇచ్చారు. దానిలో ఆయన తన సామర్థ్యాన్ని చూపాడు. ఈ పట్టుదల, ఈ కార్యశక్తి మహాత్మునికికూడ ఆశ్చర్యం కలిగించింది. ఒకనాడు గాంధిగారు ఇలా ప్రశ్నించాడు- "నీ శరీరం చాలా బలహీనంగా వుంది. ఇంతపని ఎలా చేస్తున్నావు?" "ఆత్మశక్తివంతం కావచ్చునుగదా!" అనే వినోబా ఇచ్చిన జవాబు. ఆ రోజునుంచి గాంధిగారికి ఆయనయందు ప్రత్యేకమైన శ్రద్ధకలిగింది. ఆ

యన్ని గురించి ఎక్కువ శ్రద్ధతీసుకోవడం మొదలు పెట్టాడు. క్రమక్రమంగా ఆశ్రమంలోవున్న పెద్దలలో ఆయన ఒకడుగా పరిగణింపబడ్డాడు.

నాగపూరు కాంగ్రెసు తర్వాత జమ్నాలాలు బజాజుగారికి వర్ధాలో కూడ ఒక సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించాలని బుద్ధిపుట్టింది. ఆ ఆశ్రమాన్ని నడిపించ డానికి వినోబానే ఎన్నుకున్నారు గాంధిగారు. అప్పటి నుంచీ అనగా 1921 నుండి ఆయన వర్ధాలో వుంటు న్నాడు. 1923 లో ఈ ఆశ్రమం మూసి వేయవలసి వచ్చింది అప్పటినుంచి ఆయన వర్ధాకు మైలున్నర దూరంలో వున్న "నాల్వాడీ" అనే గ్రామంలో స్థావర మేర్పరచుకుని అక్కడ ఉండిపోయినాడు. వినోబా అక్కడ ఖద్దరు కేంద్రం స్థాపించాడు. చుట్టుప్రక్కల గ్రామాలలోని ఎంతోమంది నిరుద్యోగులకు ఈ సంస్థ ఎంతో ఆధారపడింది. నూలువడికీ, గుడ్డలునేసీ ఎంతో మంది పొట్టపోసుకుంటున్నారు. తక్లీని గురించి ఆయన ఎన్నో ప్రయోగాలు చేసి చూచాడు. ఖద్దరు శాస్త్రంలో ఇప్పుడు మనంచూస్తూ వున్న అభివృద్ధి అంతా ఆయన కృషికి ఫలితమే.

వినోబాలో ఆధ్యాత్మిక తత్వం అవినాభావరూపం దాల్చింది. వారిది సంపూర్ణంగా సాధుప్రవర్తన. భగ

పద్ధతను కూలంకషంగా తాను తెలుసుకుని. ఇతరుల సమస్యలను పరిష్కరించడమేకాదు, ఆ మార్గాన నడిచి కూడ చూపించాడు. ఆయన చెప్పే ప్రతివాక్యమూ తేలికగా, అర్థముగలదై వుంటుంది. చిన్నచిన్నకథలు, సామెతలద్వారా హిమాలయమంత భావాన్నికూడ వినే వారి హృదయంలో హత్తుకుపోయేటట్లు చేయగలడు. ఆయనచెప్పే ప్రతిమాట లెక్కలమీద ఆధారపడి వుంటుంది. గణితంద్వారా ప్రపంచపు ప్రతి సమస్యనూ పరిష్కరించవచ్చునంటాడు. తాను విసుక్కుని ప్రశ్నించువానిని గాబరాపెట్టే స్వభావం ఆయనలో కన్పించదు. మీరు జీవిత సంబంధమైన ఏ విషయాన్నిగురించి అయినా ప్రశ్నించండి. మీకు వెంటనే ఎంతో క్లుప్తమైనా, స్పష్టమైన జవాబువస్తుంది. మహాత్మునిలాగు ప్రతి మాటలోనూ వినోదాన్ని సృష్టించే అలవాటు ఆయనకు లేదు. వినోబా ముఖవైఖరి ప్రశాంతమై, ఎంతో గంభీరంగా వుంటుంది. కొంతమందికి ఆయన సాధారణ మనుష్య ప్రపంచానికి దూరంగానూ కన్పడవచ్చు. కాని సంభాషణలోకి దిగినతర్వాత ఆయనలోని ఆప్యాయత, భావనాపటిమ, కార్యదీక్ష, వ్యవహార దక్షత మనలను ముగ్ధుల్నిచేసివేస్తాయి. ఆచరణ యోగ్యంకాని మాటను ఆయన ఎన్నడూ చెప్పడు. కనుకనే ఇద్దరుకు ఇంత ప్రాముఖ్యం తీసుకురాగలిగాడు. వర్ధా విద్యావిధానంలో

ఆచరణకృషి, అనుభవం, జ్ఞానం ఎంతో తోడ్పడినాయి. వృత్తులద్వారా విద్యనేర్పడమనేది వినోబాకు క్రొత్త సంగతికాదు. మానవుని జ్ఞానబోధకు అదిఒక్కటే ఏకైక మార్గమంటాడు. ప్రారంభంనుంచీ ఆయన అదే పద్ధతిని తన కార్యక్రమం సాగిస్తున్నాడు. ఖద్దరు శాస్త్రంలో పూర్తిగా మునిగిపోయినాడు. సమస్తవ్యాపారాలకు ఖద్దరునే ఆటపట్టుగా చేయగల సామర్థ్యంవుంది. ఆయనలో వర్ధా విద్యావిధానాన్ని ఇంత స్పష్టంగా దేశానికి నచ్చజెప్పడానికి వీలైంది వినోబాకృషి, ఆయన సూక్ష్మబుద్ధి ప్రభావం వల్లనే.

వినోబా ఎంతటి కార్యశూరుడో, అంతకంటే ఎక్కువగా బోధించకలిగిన ఉత్తమ ఉపాధ్యాయుడు. ఈ నేర్పును ఆయన పుస్తకాలు చదివీ, శాస్త్రాల్లు పఠించీ సంపాయించుకున్నదికాదు. నిరంతర చింతనా శక్తియే దీనికికారణం. ఎంతో ధాటిగా ఉపన్యసించగలడు. మరాఠీ భాషలో వెలువడిన "మధుకర" అనే పుస్తకం చదివితే వారి రచనా కౌశలం, శైలి బోధపడుతుంది.

వినోబా ఏదిచెప్పినా ముందు దానిని తన శరీరంమీద, మనసుమీద ప్రయోగించి చూచుకుంటాడు. ఆయన చెప్పేదానికీ నడవడికీ కించిన్మాత్రమైన తేడా

కన్పడదు. ఆయన వుండేది ఒక వెదురు తడికెల గుడిసెలో. కొన్నాళ్లనుంచి ఆరోగ్యాన్ని కుదుర్చుకోవాలను దృష్టితో "నాల్వాడీ"ని విడిచి, వర్ధాకు ఆరుమైళ్ళ దూరంలో వున్న "పావునారు" అనే చోట వున్నాడు. సాధ్యమైనంతవరకు పట్టణవాసానికి దూరంగా వరుగిడుతాడు. గ్రామాలకు బీదప్రజలకు సేవ చేయడమంటే ఆయనకు ఎంతోవుత్సాహం. తరచుగా చుట్టుప్రక్కల గ్రామాలకు కాలినడకనుపోయి ఖద్దరు, భగవద్గీత మొదలైన విషయాలు బోధించి, వారిస్థితిగతుల్ని తెలుసుకుంటూవుండడం ఆయనకు మామూలై పోయింది. పేరు ప్రతిష్ఠలకు దూరంగా వుంటేనేకాని నిజమైన సేవ సాధ్యంకాదని ఆయన విశ్వాసం.

రాత్రింబవలు పుస్తకాలు చదువుతూ కూర్చునే వారిని చూస్తే ఆయన చాలా ఏవగించుకుంటాడు. అధికంగా చదివిన కొద్దీ మానవునిలోవున్న సహజమైన ప్రతిభాశక్తి క్షీణించి, మానసికదాస్యం ఏర్పడుతుందనీ, ఏదిమంచిదో ఏదిచెడ్డదో నిర్ణయించుకునే శక్తి అసలే వుండదనీ తరచుగా అంటువుంటాడు. "కర్మయే మనకు సాటిలేని గురువు. ప్రకృతి మాతయే మనకు విశాలమైన పఠనా గ్రంథం" అని ఆయన దృఢవిశ్వాసం అందుకే ఆయన ఏవిషయాన్నిగురించి మాట్లాడినా అందులో అపూర్వమైన ఒక క్రొత్తదనం ఉండితీరుతుంది.

ఈ ప్రకృతి పర్యవేక్షణమే వర్ధాలోని గాంధీ వర్గంలో ఆయన్ని మేటిగా చేసింది. వినోబాలో జ్ఞానం ఆచరణ మూర్తీభవించినాయి. అందుకే గాంధిగారి దృష్టి ఎప్పుడూ ఆయినవైపుకు వుంటుంది. ఎన్నో విష యాల్లో వినోబాను ఆదర్శప్రాయుడుగా భావిస్తాడు మహాత్ముడు. ఆదర్శసేవకుడెట్లా ప్రవర్తించాలో వారీ శ్లోకాన్ని స్వయంగా రచించారు.

"అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్య అసంగ్రహ ।
శరీరశ్రమ అస్వాద సర్వత్ర భయవర్జనా ।
సర్వధర్మీ సమానత్వ, స్వదేశీ స్పర్శభావనా ।
హీ(ఏకాదశ సేవావీ(నమ్రత్వే( వ్రతనిశ్చయే(॥"

(1. అహింస, 2. సత్యం, 3. దొంగతనం లే కుండా వుండడం, 4. బ్రహ్మచర్యం, 5. కూడబెట్టు కోకుండావుండడం, 6.శరీరపరిశ్రమచేయడం, 7 జిహ్వా చాపల్యం లేకుండా వుండడం, 8. ఎక్కడ భయం లేకుండా వుండడం, 9. సర్వధర్మాల్ని సమానంగా తల చడం, 10. స్వదేశీ, 11. స్పర్శభావం. ఈ పదకొండు సేవల్ని వినమ్రతతో వ్రతపూర్వకంగా అనుసరించడం కోసం నిశ్చయిస్తున్నాను.) ఇవన్నీ ఆచరించి పరిణా మంగా ఏర్పడ్డ ప్రతిమా స్వరూపమే శ్రీ వినోబాభావే అంటే ఏమీ అతిశయోక్తిగాదు.



# గీతామూలం.

## భగవద్గీతయొక్క ప్రయోజనం.

భగవద్గీతతో నాకుగల సంబంధం తర్కాతీతం. నా యీ శరీరం తల్లి పాలతో పెరిగింది. అంతకంటె యెక్కువగా నా యీ హృదయం, బుద్ధి- రెండున్నూ గీత అనే పాలతో పోషించబడినాయి. ప్రేమలో తర్కానికి తావులేదు. తర్కాన్ని విడనాడి, శ్రద్ధ- ప్రయోగము అనే రెండు రెక్కల సహాయంతో గీతాకాశాన యథాశక్తి విహరిస్తూ ఉంటాను. నేను తరచుగా గీతా వాతావరణంలోనే మెలగుతూ ఉంటాను. గీతయే నా ప్రాణతత్వం. భగవద్గీతనుగురించి ఇతరులతో ప్రసంగించవలసివచ్చినప్పుడు మాత్రం గీత అనే సముద్రం పైన తేలి ఈదుతూ ఉంటాను. ఏకాంతం లభించగానే ఆ అమృత సముద్రంలో బాగా లోతుగా మునకలు వేస్తూ ఉంటాను.

గీత మహాభారతంలో ఇమడ్చబడింది. అది భారతం మధ్యలో మహాభారతాన్నంతటినీ ప్రకాశింపజేస్తూ, పెద్ద దివిటీలాగ వెలుగుతోంది. ఒకవైపున ఆరుపర్వాలు, ఇంకొకవైపున పన్నెండు-. ఒక వైపున

ఏడు అక్షౌహిణులు- రెండోవైపున పదకొండు అక్షౌహిణుల సేనకు మధ్యలో నిలబడి గీతోపదేశం జరుగుతోంది.

భారత-రామాయణాలు మన జాతీయ గ్రంథాలు. అందులోఉన్న వ్యక్తులు మన జీవితంతో ఏకమై పోయినారు. రాముడు-సీత. ధర్మరాజు-ద్రౌపది, భీష్ముడు-హనుమంతుడు-వీరి జీవితాదర్శాలు వేలతరబడి సంవత్సరాలనుంచి భారతీయుల్ని మంత్ర ముగ్ధులుగా చేస్తూ వస్తున్నాయి ప్రపంచంలోనున్న ఇతర మహాకావ్యాలలోని పాత్రలు ప్రజాజీవితంలో ఇంతగా కలిసి ఏకమైనట్లు కనుపించవు ఈ దృష్టితో రామాయణ భారతాలు నిజంగా అద్భుతగ్రంథాలు. రామాయణం మధురమైన నీతి కావ్యం. భారతం విశాల దృష్టి సంపన్నమైన సాంఘిక శాస్త్రం. వ్యాసుడు ఒక లక్ష సంహితలు వ్రాసి అసంఖ్యామైన చరిత్రలు, ఆచారములు, ధర్మములు, ఎంతో నేర్పుగా ప్రస్ఫుటస్పష్టంగా చిత్రించాడు.

ఏ విధమైన దోషము లేనట్టివాడు ఒక భగవంతుడు మాత్రమేననీ, అదేవిధంగా అన్నివిధాలా దోషాయుక్తమైన వస్తువే ప్రపంచంలో లేదనీ భారతం స్పష్టంగా నిర్వచిస్తోంది. భీష్ముడు, యుధిష్ఠిరునివంటి మహాత్ములలో కూడ దోషాలు చూపించబడినాయి.

అలాగే కర్ణుడు, దుర్యోధనుడు మొదలైన వారిలోని గుణాలుకూడ ప్రకటింపబడ్డాయి మానవ జీవితం నలుపు-తెలుపు దారాలతో కలనేసినగుడ్డ వంటిదని చెప్పుతుందిభారతం వ్యాసభగవానుడు స్వయంగా నిర్లిప్తుడై, ప్రాపంచిక సుఖదుఃఖాలు జ్ఞానాజ్ఞానాలతోకూడిన స్త్రీ-పురుషపాత్రలను మహాభారత రంగంలో ప్రదర్శిస్తున్నాడు. వ్యాసుని లోకోత్తరమైన గ్రంథరచనా కౌశలం వల్లనే భారత గ్రంథం ఒక బంగారపు గనిగా తయారయ్యింది. పరిశోధించి ఎవరికివచ్చిన బంగారం వారు తీసుకోవచ్చు.

వ్యాసుడు ఇంత గొప్పగ్రంథం వ్రాసాడుగదా! అందులో ఆయన ఏమైనా ప్రత్యేకమైన సందేశం చెప్పదలచినాడా? ఎక్కడైనా ముఖ్యమైన విషయాన్ని వెలిబుచ్చాడా? ఏ పర్వంలో ఆయన ఎక్కువ నిమగ్నుడు కాగలిగినాడు? ఎక్కడపడితే అక్కడ ఎన్నో తత్వజ్ఞానాలు, ఉపదేశాలు భారతంలో నిండివున్నాయి. కాని ఈ తత్వజ్ఞానాలు, ఈ ఉపదేశాలు లేదా మొత్తం గ్రంథానికి సారభూతమైన రహస్యాన్ని ఆయన ఎక్కడైనా వెలిబుచ్చాడా? అనే ప్రశ్నలు కలుగుతూ వుండడం సహజం "అవును, మొత్తము భారతాని కంతటికే భగవద్గీత వెన్నముద్దవంటిది" అని జవాబు చెప్పుకోవచ్చు. వ్యాసుని జీవితానుభవం, మన సంస్కృతియొక్క ప్రతిఫలమే

భగవద్గీత. "మునులలో నేను వ్యాసమునిని" అనే పలుకు సార్థకమవుతున్నది దీనివల్లనే. పురాతనకాలం నుంచీ గీత ఉపనిషత్తుగా పరిగణింపబతుతోంది. గీత నిజంగా ఉపనిషత్తులకుకూడ ఉపనిషత్తు ఎందుకనగా అర్జునుని నెపంమీద జగత్తుకు ఉపనిషత్తులు పిండి ఈ గీతామృతం ఇచ్చాడు వ్యాసుడు జీవితానికి అవసరమైన ప్రతివిషయం గీతలో లభిస్తుంది అందుకనే "గీత ధర్మానికి. జ్ఞానానికి నిఘంటు" అని అనుభవజ్ఞులు చెపుతారు. గీత హిందూమతానికి ఆకారంలో చిన్నదైనా ప్రాముఖ్యమైన గ్రంథం.

గీతోపదేశంచేసింది కృష్ణుడని అందరికీ తెలుసు. ఈ పరమ ఉపదేశాన్ని వినే భక్తుడైన అర్జునుడు అయనతో సంలగ్నమై ఏకమై తానుకూడ "కృష్ణుణ్ణ"నిపించుకున్నాడు. భగవంతునియొక్క, భక్తునియొక్క హృద్గతభావాలను వ్యక్తపరచడంలో లీనమై, తనను మరచిపోయిన వ్యాసునికూడ శ్రీకృష్ణుణ్ణిగానే గుర్తించింది ప్రజాసముదాయం. చెప్పేది కృష్ణుడు. వినేది కృష్ణుడు. వ్రాసింది కృష్ణుడు- ముగ్గురూ అద్వైతరూపంతాల్చారు. ముగ్గురూ ఒకే సమాధిలో మగ్నమైపోయినారు. పాఠకులుకూడ అలాగే ఏకాగ్రచిత్తులు కాగలిగినప్పుడే గీతను అవగాహన చేసుకోకలుగుతారు.

రెండవ అధ్యాయంనుంచి గీత ప్రారంభం కావలసిందని కొందరి అభిప్రాయం "రెండవ అధ్యాయంలో పదకొండవ శ్లోకంతో ప్రత్యక్ష ఉపదేశం ప్రారంభమౌతుంది. అక్కడీనుంచి ప్రారంభమయితే కలిగే నష్టమేమిటి? "భగవంతుడు అక్షరాలలో 'అకారం' ఈశ్వర విభూతి" అని భగవంతుడు చెప్పాడు. "అశోచ్యానన్వ శోచ_స్త్వం" అనే శ్లోకంలో ప్రారంభం అకారం అనాయాసంగానే వచ్చివేసింది. కనుక అక్కడినుంచే ప్రారంభంచేయాలి." అని ఒక మిత్రుడు నాతో అన్నాడు. ఈ శ్లేషభావాన్ని విడిచిపెట్టిచూచినా అక్కడినుంచి ప్రారంభించడం సరియైన విషయమే. ఇందులో సందేహమేమీలేదు. అయినా అంతకుముందు చెప్పిన ప్రస్తావనకూడ విలువకలిగిందే. ఈ భూమిక ప్రస్తావన లేకుండా, అర్జునుడు ఏమార్గాన ఉన్నాడో, గీత ఏవిషయాన్ని బోధించడానికి అవతరించిందో, దీన్ని సరిగా తెలుసుకోవడానికి వీలుండేదికాదు.

అర్జునుని పిరికితనాన్ని తొలగించి, అతన్ని యుద్ధంలో పురికొల్పడానికే గీతోపదేశం జరిగిందనుకుంటారు కొందరు. వారి ఉద్దేశ్యప్రకారం గీత కేవలం కర్మయోగాన్ని ప్రతిపాదించడమేకాక, యుద్ధయోగాన్ని కూడ ప్రతిపాదిస్తుంది. కొంచెం ఆలోచిస్తే, వీరి అభి

ప్రాయంలో ఉన్న లోటుకనిపిస్తుంది. పద్దెనిమిది అక్షౌహిణీల సైన్యం పోట్లాడడానికి సిద్ధపడిఉంది. అర్జునుడు అందుకు యోగ్యుడుగా చేయబడ్డాడని చెపుదామా? అర్జునుడు గాబరాపడ్డాడు. ఆ సేన గాబరాచెందలేదు. అందుకని ఆసేన అతనికంటె ఎక్కువ యోగ్యతకలదా? అలా ఆలోచించనుకూడ ఆలోచించకూడదు. పిరికితనం చేత అతను యుద్ధాన్ని మానుకోదలచుకోలేదు. ఎన్నో యుద్ధాలలో అనుభవం పొందిన మహావీరుడతడు. ఉత్తరగోగ్రహణ కాలంలో ఒంటరిగా అర్జునుడు భీష్మ, ద్రోణ, కర్ణాదులను పరాజితులుగాచేసి వేశాడు. అతడు ఎప్పుడూ విజయమే పొందుతాడన్, నరులందరిలో అతి నొక్కడే సిసలైననరుడని అతనికి ఖ్యాతికూడాను. వీరత్వం అతని రోమరోమంలో నిండివుంది. అర్జునుణ్ణి రెచ్చగొట్టడానికని శ్రీకృష్ణుడు నిర్వీర్యతను ఆరోపించి చూచాడు. కాని ఏమీ లాభించలేదు చివరకు ఇతర మార్గాననే జ్ఞాన-విజ్ఞాన సంబంధమైన ఎన్నో ఉపన్యాసాలివ్వవలసివచ్చింది కనుక అర్జుననియందు నిర్వీర్యతను ఆరోపించి, అతన్ని సిరసించి కార్యాన్ని సాధింపడమే గీతయొక్క ఉద్దేశ్యంకాదని, నిశ్చయంగా చెప్పవచ్చు.

"అర్జుననిలోవున్న అహింసాప్రవృత్తిని నివారించి అతనిని యుద్ధానికి పురికొల్పడమే గీతయొక్క

ముఖ్య ఉద్దేశ్యం" అని కొందరి అభిప్రాయం. నా దృష్టిలో ఇదికూడ సరికాదు. ఎందుకంటారా? గీస్కు నిశ్చయించడానికి మనం అర్జునుని అప్పటి మనోస్థితిని పరీక్షించాలి. ఇందుకు మొదటి, రెండవ అధ్యాయాల్లో చెప్పబడిన విషయం చాలా ప్రయోజనకారి.

అర్జునుడు కృతనిశ్చయుడై యుద్ధరంగంలోకి కర్తవ్యభావంతో వచ్చాడు. క్షాత్రతేజం అతని స్వభావంలో ఉంది. యుద్ధం ఏవిధంగానైనా తప్పించుకుందామని ఎంతప్రయత్నించినా అది తప్పలేదు. పాండవుల కనీసపు కోరిక, కృష్ణునివంటివాని మధ్యవర్తిత్వం నిష్ఫలమైపోయినాయి. అప్పుడు నానాదేశరాజన్యుల్ని పోగు చేసుకుని, కృష్ణుణ్ణి తనకు సారథిగా ఉండేటట్టుఒప్పించి, తాను యుద్ధభూమిలో నిలబడతాడు అర్జునుడు. తరువాత తన సహజ వీరోల్లాసంతో కృష్ణుణ్ణిచూచి ఇలా అంటాడు- "రెండుసేనలకు మధ్యనా రథాన్ని నిలబెట్టు ఎవరెవరు నాతో పోట్లాడడానికి వచ్చారో, ఒక్కసారి వారి స్వరూపాలు చూస్తాను."

కృష్ణుడు అదేవిధంగా చేశాడు. అర్జునుడు నలువైపుల దృష్టి నిగిడ్చి, రెండువైపుల తనచుట్ట పక్కాలు, ఇష్టబంధువులు పంక్తులుతీరి నిలబడి ఉండటం అతను చూచాడు. తాతలు, తండ్రులు. పుత్రులు, మనమళ్ళ-

నాలుగుతరాలవారు చంపడానికి- చావడానికి కృతనిశ్చ యులై యుద్ధరంగంలో పోగవడం అతను చూచాడు. అతనికీ విషయం అంతకుముందు తట్టలేదనుకోవడానికి కూడ వీల్లేదు. అయినా ఎదటచూచేసరికి కలిగే మనో భావం వేరు. ఇంతమంది బంధుమిత్రాదుల్ని చూచి అతనిగుండె కరిగి నీరైపోతుంది. ఎంతో దుఃఖం కలుగుతుంది. అంతకుముందు అతను ఎన్నోయుద్ధాల్లో, ఎంతోమంది వీరుల్ని సంహరించాడు. అప్పుడతనికి దుఃఖంకలగలేదు. అతనిచేతిలోనుంచి గాండీవంజారి పడలేదు. అతని వళ్ళు గగుర్పొడవలేదు. అతనికళ్ళు నీళ్ళుకార్చలేదు.

పోతే ఆనాడుమాత్రమే అలా ఎందుకుజరిగింది? అశోకునివలె అతనిహృదయంలోకూడ అహింసాభావం ఉదయించిందా? లేదు లేదు! ఇదంతా స్వజనులయం దుండే ఆసక్తిమాత్రమే. ఈ రోజుకూడ ఆయుద్ధంలో బంధుమిత్రాదులు లేకుండా, పరాయివాళ్ళే అయివుంటే వారి శిరస్సుల్ని బంతుల్లాగ ఎగరగొట్టేవాడే. కాని మమకారంవలనకలిగిన మోహం అతని కర్తవ్యనిష్ఠను మింగివేసింది.

ఇక అతనికి తత్వజ్ఞానం జ్ఞాపకం వచ్చింది. కర్తవ్య నిష్ఠగలవ్యక్తి మోహంలో చిక్కుకున్నప్పటికీ

పూర్తిగా కర్తవ్యచ్యుతుడు కావడమంటే అతనికి మనసులో పీకుతూనే వుంటుంది. అప్పుడతను తన దౌర్బల్యాన్ని దాచుకోవడానికి ఏవో కొన్ని ధర్మతత్వాలు ఆధారం చేసుకుంటాడు. అర్జునుని విషయంలోకూడ అలాగే జరిగింది. అందుకని అతను ఈవిధంగా ప్రారంభించాడు- "యుద్ధము పాపస్వరూపం. యుద్ధంవల్ల వంశక్షయమవుతుంది. ధర్మం లోపించిపోతుంది. స్వేచ్ఛాచారం పెంపొందుతుంది వ్యభిచారవాదానికి కాళ్లు వస్తాయి. దుర్భిక్షకలుగుతుంది. సంఘం కష్టాలపాలవుతుంది." ఈ విధంగా ఎన్నో యుక్తులు శ్రీకృష్ణునికే చెప్ప నారంభించాడు.

ఈ సందర్భంలో నాకొక కథ జ్ఞాపకం వస్తోంది. ఒక న్యాయాధికారి ఉండేవాడు. అతను వందలకొలది అపరాధులకె శిక్షలు విధించాడు. కాని ఒకరోజున అతని కొడుకే హత్యచేసిన అపరాధంతో అతని ఎదుటికి తీసుకురాబడ్డాడు. కొడుకుచేసిన నేరం రుజువయింది. ఉరిశిక్ష వేయవలసివచ్చింది. కాని ఆ న్యాయాధికారి మనసులో గుంజాటన ప్రారంభమైంది. ఇంకేముంది? అతని బుద్ధి తర్కాన్ని ఆధారం చేసుకుంది- "ఉరిశిక్ష అమానుషికం. ఇటువంటి శిక్షవిధించడం మనిషికి తగెందికాదు. ఈ శిక్షవు కారణంగా మనిషిని సంస్క-

రించవచ్చుననే ఆశయే నశించిపోతుంది. హత్యచేసిన వాడు ఏదో ఆవేశంలోచేసి ఉంటాడు. కాని ఇప్పుడు అతని ఉద్రేకం తొలగిపోయింది. ఇప్పుడతన్ని గంభీరంగా మనస్సును చిక్కపట్టి ఉరికంబానికి వ్రేల తీసి చంపడం సంఘంలో ఉన్న మానవత్వాన్ని సిగ్గుపరచి కళంకపరచడమన్నమాటే." ఇలాంటి వెన్నో సాకులు ఆలోచించ నారంభించాడు. అతనికొడుకు ప్రసంగమే రాకపోతే ఆయనగారు జీవితమంతా ఉరిశిక్షలువేస్తూనే ఉండేవాడు. కొడుకుమీద ఉండే మమకారం అతన్ని ఇలా అనిపించింది. అతని పలుకులు ధర్మబద్ధములని చెప్పవీలులేదు. అవి ఆసక్తి జన్యంమాత్రమే. 'వీడు నాకొడుకు' అనే మమకారంవల్ల కలిగిన వైరాగ్యంఅది

అర్జునుని పరిస్థితికూడ ఆ న్యాయాధికారిలాగే అయింది. అతనుచెప్పిన యుక్తులుకూడ తప్పుకాదు. గత యూరోపీయ మహాయుద్ధంలో సరిగ్గా ఇవే ఫలితాలు మనకు కనుపించినాయి. పోతే భేదమేమంటే. ఇందులో అర్జునుని తత్వజ్ఞానం లేదన్నమాట. అది ప్రజ్ఞావాదం. కృష్ణునికిది బాగా తెలుసు. కనుకనే అతని యుక్తుల్ని లేశమైనా పాటించకుండా తిన్నగా మోహాన్ని భంగపరచే ఉపాయమే ఆలోచించాడు. అర్జునుడు నిజమైన అహింసావాదియే అయినట్లయితే కృష్ణుడు

మధ్యలో అవాంతరంగా ఎన్ని జ్ఞాన-విజ్ఞానాలు ప్రతిపాదించినా, అతని మూలప్రశ్నకు సమాధానం దొరకనంతవరకు అతను తృప్తిపడేవాడుకాడు. కాని గీత అంతా వెతికినా ఈ ప్రశ్నకు సమాధానమిచ్చినట్లు ఎక్కడా కనుపించదు. అయినా అర్జునునికి సమాధానం కుదిరింది.

ఇంతకూ చెప్పదలచిందేమంటే, అర్జునునిలో అహింసా ప్రవృత్తేమి లేదు. మోహానికే ప్రవృత్తుడై ఉన్నాడు. యుద్ధం చేయడం అతనికి సహజమైపోయింది. అది అతనికి విడువరాని కర్తవ్యం. మోహాంధతవల్ల ఇప్పుడా కర్తవ్యాన్ని మరచినాడు. ఈ మోహాన్నే గీత ముఖ్యంగా పటాపంచలు చేయడానికి ప్రయత్నించింది.

అర్జునుడు ఒక్క అహింసనుగురించేకాక, సన్న్యాసాన్నిగురించికూడ మాట్లాడడం ప్రారంభించాడు "ఈ హత్యాయుక్తమైన క్షాత్రధర్మంకంటె సన్న్యాసం మేలు" అంటాడు అర్జునుడు. కాని ఇది అతని స్వధర్మమా? అది అతని నైజస్వభావమా? అర్జునుడు సన్న్యాసివేషం తేలికగా వేసుకోగలడు. కాని సన్న్యాసుని మనోవృత్తి అతనికెలా లభిస్తుంది? సన్న్యాసమనేపేరుతో అతను అడవిలోనికి వెళ్ళి ఉన్నా, అక్కడ జింకల్నిపట్టి వేటా

డుతూ ఉండేవాడే. అందుకే భగవానుడు స్పష్టంగా చెప్పాడు- ఒరేయి అర్జునా, నేను యుద్ధంచేయనని నీవు అనడం అది నీ పొరపాటు మాత్రమే. ఇప్పటి వరకు నీలో ఉన్నస్వభావం నీచేత యుద్ధంచేయించేతీరుతుంది!"

అర్జునునికి స్వధర్మం వికటంగా కన్పడ నారంభించింది. కాని స్వధర్మం ఎంత పరిహాసాస్పదమైనా, డా[illegible]నుసరించే మన మనస్సును వికసింపచేసుకోవా[illegible]ందుకంటే, స్వధర్మం పాలించినప్పుడే అతను రాణిస్తాడు. ఇందులో అభిమానమేమీలేదు. ఇదే అభివృద్ధికి రాచబాట, స్వధర్మం గొప్పదనే ఉద్దేశ్యంతో ఆచరించవూనడంకాని, నీచమని విడిచిపెట్టడంకాని కూడదు. నిజం చెప్పాలంటే ఏది గొప్పదికాదు, తక్కువకాదు. స్వధర్మం ఆయా మనుష్యులయొక్క ప్రకృతి, స్వభావాలు, అభ్యాసాలమీద ఆధారపడి వుంటుంది. "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని గీతలో చెప్పబడిన 'ధర్మ' శబ్దానికి అర్థం హిందూధర్మం, మహమ్మదీయ ధర్మం, క్రైస్తవధర్మంలాంటిదికాదు. ప్రతివ్యక్తికీ వేర్వేరు ధర్మం వుంటుంది. ఇక్కడ నాయెదుట కూర్చున్న మీ రెండువందలమందివి రెండువందలధర్మాలు. పది సంవత్సరాలకుముందు నాకు ఉన్న ధర్మం ఈ రోజునలేదు. అనుభవం, చింతనాశక్తినిబట్టి ప్రవృత్తి మారిన కొలదీ

వెనుకటిధర్మంమారి క్రొత్తధర్మం మనకు లభిస్తుంది. ఒకేదాన్ని అంటిపెట్టుకోవలసిన అవసరం లేదు.

పరాయిధర్మం గొప్పదయినా, దాన్ని స్వీకరించడంవల్ల నాకు మేలుకలగదు. సూర్యునివెల్తురు నాకు ప్రియం. దానివల్ల నాకు వికాసంకూడ కలుగుతుంది. అది నాకు వందనీయం కూడాను. అందుకని నేను భూమిమీద ఉండటంమాని, అతని దగ్గరకు వెళ్ళితే భస్మమై పోతాను. దీనికి బదులు, భూమిమీద ఉండడం అంతగౌరవప్రదం కాకపోయినా, సరే, సూర్యునితో పోలిస్తే భూమి తుచ్ఛంగా కనపడ్డాసరే. భూమికి స్వయం ప్రకాశం లేకపోయినా సరే, సూర్యుని తేజస్సును సహించే సామర్థ్యం నాలో లేనంతవరకు, నేను సూర్యుడికి దూరంగా భూమిమీదనే నివసించి, నన్ను వికసింపచేసుకోవలసి ఉంటుంది. చేపతో ఎవరైనా- "నీళ్ళకంటె పాలు విలువగలవి. నీవు పాలలోనే ఉండు" అని అంటే అది ఒప్పుకుంటుందా? చేప నీళ్లలోనే బ్రతుకుతుంది- పాలలో చచ్చి ఊరుకుంటుంది.

పరాయిధర్మం తేలికగా కనపడ్డా, దాన్ని అవలంబించకూడదు. అనేకసార్లు భ్రమవల్ల తేలిక అనుకుంటాం. ఇంట్లోఉన్న భార్యను- పిల్లల్ని సరిగాపోషించే శక్తిలేక ఏగృహస్థుడన్నా సన్యాసిఅయితే అదిఅతని ఆ

ప్రవంచనం మాత్రమే అవుతుంది. అతను సన్యాసధర్మా న్ని నిర్వహించలేడు. వీలుదొరకగానే అతనిలో అణగి ఉన్న కోరికలన్నీ రేకెత్తుతాయి. కుటుంబభారాన్ని మోయలేక సన్యాసిఅయినవాడు, అడవిలోకివెళ్ళి ముందు అక్కడ ఒకచిన్న కుటీరంవేస్తాడు. దాన్ని రక్షించడానికి చుట్టూ కంచెవేస్తాడు ఇలాగే నెమ్మదినెమ్మదిగా దాన్ని ఎంతో అలంకరింపవలసిన సమయం వస్తుంది. నిజమైన వైరాగ్యభావం ఉంటే సన్యాసం మాత్రం ఏమికష్టం? "సన్యాసం తేలిక" అని చెప్పే స్మృతివాక్యాలుకూడ ఉన్నాయి. అసలు కావలసింది అభిరుచి. దాన్నిబట్టే అని ధర్మంకూడ ఉంటుంది. శ్రేష్ఠము, కనిష్ఠము; తేలిక, కష్టము అనేది ఏమీలేదు. యదార్థ వికాసం జరగాలి. నిజమైన పరిణతికలగాలి.

'ఏ విధంగా చూచినా సన్యాసం యుద్ధధర్మం కంటె శ్రేష్ఠమైనప్పుడు భగవానుడు అర్జునుణ్ణి నిజమైన సన్యాసిని ఎందుకు చేయలేదు? భగవంతుడుకూడ అలా చేయలేక పోయినాడా? ఆయనకు సాధ్యంకానిది ఏమీ లేదే!' అని అడుగుతారు కొందరు శ్రద్ధాళువులు. కాని అలాచేస్తే అర్జునుని పురుషార్థం ఏమి ఉండేది? పరమేశ్వరుడు అందరికి స్వాతంత్ర్యం ఇస్తాడు. ప్రతిజీవి స్వయంగా ప్రయత్నించాలి ఇందులోనే ఆనందం.

చిన్నపిల్లలు తమంతటతామే బొమ్మలు గీయటానికి ఉత్సాహపడతారు. ఎవరైన చేయి పట్టుకుంటామంటే వాళ్లకి యిష్టముండదు. గురువు పిల్లల్ని వెంటవెంటనే ప్రశ్నలువేసి, సమాధానం చెప్పివేస్తుంటే వారిబుద్ధి ఎలావికసిస్తుంది? తల్లిగాని, తండ్రిగాని. గురువుగాని పిల్లలికి సూచనమాత్రం ఇచ్చి వదలిపెట్టాలి పరమేశ్వరుడు లోపలనుంచి సూచనమాత్రం ఇస్తాడు. ఇంతకు మించి ఆయన ఏమీచేయడు. ఈశ్వరుడు కుమ్మరి వానిలాగ నొక్కి నొక్కి లేక సవరించి సవరించి కుండలు తయారుచేస్తే అందులో ఇంకేమి ఆనందం ఉంటుంది? మనం కుండలంకాదు— మనం చిన్మయులం.

"స్వధర్మాన్ని పాడుచేసే మోహాన్ని తొలగించడానికే భగవద్గీత పుట్టిందని" ముందుచెప్పినదాన్నిబట్టి మీరు తెలుసుకుని వుంటారు. అర్జునుడు ధర్మాంధుడైనాడు. స్వధర్మాన్నిగురించి అతనికి మతిభ్రమకలిగింది. ఈవిషయంలో కృష్ణుడు మొదట హేళన చేసినతర్వాత స్వయంగా అర్జునుడే ఒప్పుకుంటాడు. ఆమోహాన్ని, ఆమమకారాన్ని, ఆఆసక్తిని తొలగించిడమే భగవద్గీతయొక్క ముఖ్య ఉద్దేశ్యం. గీత అంతా సమాప్తమైన తర్వాత భగవానుడు అడుగుతాడు— "అర్జునా! మోహం తొలగిందా?" "మోహం తొలగింది. స్వధర్మం

గుర్తించాను.'' అన్నాడు అర్జునుడు. ఈప్రకారం భగవద్గీత ప్రారంభం, ఉపసంహారం కలిపిచూస్తే మోహ నిరాకరణమే గీతకు ముఖ్య ఉద్దేశ్యం. అని తెలుతుంది. ఒక గీతనుగురించేకాదు భారతంకూడ ఇదే ఉద్దేశ్యంతో రచించబడ్డది. "ప్రజల హృదయం మీది మోహాపరణను తొలగించడానికే నేనీ చారిత్రిక దీపాన్ని వెలిగిస్తున్నాను.'' అని వ్యాసుడు మహాభారతం ప్రారంభంలోనే చెప్పాడు.

మిగిలినగీతను తెలుసుకోవడానికి అర్జునుని ఈ భూమిక మనకు ఉపకరించిదికనుక దానిఉపకారం మనం ఒప్పుకోవలసిందే. కాని ఇంతకుమించికూడా ఇంకా ఉపకారం ఉంది. అర్జునుని ఈభూమికలో అతని మనస్సులోని పరమరుజుత్వం మనకు గోచరిస్తుంది. "అర్జున" శబ్దానికి అర్థమే "రుజు" అంటె "సరళస్వభావము.'' అన్నమాట. అతని మనస్సులో ఏమేమి వికారాలు, భావాలు కలిగినయో, వాటినన్నిటిని అతను నిష్కపటంగా కృష్ణుడికి నివేదించాడు. తన మనస్సులో ఏమాత్రమూదాచలేదు. చివరకు కృష్ణునిశరణుజొచ్చాడు. నిజం చెప్పవలసివస్తే, అతను మొదటినుంచీ కృష్ణుని శరణులోనే ఉన్నాడు. ఎప్పుడైతే అతను కృష్ణుణ్ణి తన సారథిగా చేసుకుని, తన గుర్రాల కళ్ళెం అతనికి వప్ప

చెప్పాడో, అప్పుడే తన మనోభావాల కళ్ళెంకూడ అత నికి వప్పచెప్పడానికి సిద్ధమైనాడన్నమాటే.

రండి, మనంకూడ ఇలాగే చేద్దాం. "అర్జును డికి దగ్గర కృష్ణుడున్నాడు. మనకు కృష్ణుడు ఎక్కడ దొరుకుతాడు?-" అని ఎప్పుడూ అనవద్దు. "కృష్ణుడనే ఒక మనిషి ఉన్నాడు" అనే పరంపరాగతమైన ఈ అ భిప్రాయముం మిక్కిలిభ్రమతో కూడింది.

అంతర్యామియై కృష్ణుడు ప్రతిహృదయంలోనూ ప్రకాశిస్తున్నాడు. మనకు అతను ఎంతో దగ్గరలో ఉన్నాడు. మన హృదయంలోని దుష్టత్వాన్ని, మాలి న్యాన్ని పూర్తిగా అతని యెదుటపెట్టి, అతన్ని ప్రార్థి ద్దాం- "భగవంతుడా! నేను నీ శరణుజొచ్చాను. నీ కంటే మించిన నాకు గురువులేదు. నాకు బాటచూపు. నీవు చూపిన మార్గానే నేనుపోతాను." మనం ఇలా చేస్తే ఆ పార్థసారథి మనకుకూడ సారథ్యం చేస్తాడు. మనకు కూడ తన గీత వినిపిస్తాడు. మనకుకూడ విజ యం కలుగజేస్తాడు.

---

# భగవద్గీత జీవితానికి సంపూర్ణ జీవిత శాస్త్రం.

క్రిందటిసారి మనం అర్జునుని విషాద యోగాన్ని గురించి విన్నాం. అర్జునుని సారల్యంవంటి సారల్యం, ఆత్మసమర్పణ వున్నచోట విషాదంకూడ ఒక యోగం అవుతుంది. దీనిని మనం హృదయ మంథన మంటాము. సూత్రకారునివలె భగవద్గీతయొక్క ఈ భూమికకు "అర్జునుని విషాదయోగమని ప్రత్యేకమైన పేరు బెట్టకుండా "విషాదయోగం" అన్నాను. అందరికీ అనువర్తించేటట్లు. కారణమేమంటే. భగవద్గీతకు అర్జునుడు నిమిత్తమాత్రుడు. పండరీపురపు పాండురంగడు పుండలీకుని కొరకు అవతరించలేదు పుండలీకుని నెపంతో అతను మనవంటి జడజీవుల్ని ఉద్ధరించడానికై వేల కొలది సంవత్సరాలనుండి నిలబడి వుండడం మనం చూస్తూనే వున్నాము. అలాగే భగవద్గీత అవతరించడానికి అర్జునుని ఆధారం కావలసి వచ్చింది. యదార్థం చెప్పవలసివస్తే, అర్జునుడు ఇందులో నిమిత్త మాత్రుడే. మన అందరి ఉద్ధరింపుకొరకే అదిపుట్టింది. కనుక గీత మొదటి అధ్యాయానికి 'విషాద యోగం' అని పేరు

పెట్టడం బాగానే వుంది. ఇక్కడినుంచి గీత అను మొక్క క్రమంగా పెరిగి పెద్దదై, ఆఖరుకు చివరి అధ్యాయపు 'ప్రసాద యోగం' అనే ఫలం వరకు చేరు తుంది ఈశ్వర కృపవుంటే ఈ వైఖ జీవితంలోనే మనం చివరివరకు చేరుకుంటాం.

రెండవ అధ్యాయంనుంచి గీతలోని వుపదేశం ప్రారంభమౌతుంది. ప్రారంభంనుంచే భగవానుడు మహ త్తరమైన జీవిత సిద్ధాంతాలను ప్రారంభిస్తాడు. మానవ జీవితానికి ప్రాతిపదికలైన ముఖ్య తత్వాలను మనం గ్రహించి జీర్ణించుకో కలిగితే భావి జీవితమార్గం తేలికై పోతుందనేది మొదటి విషయం. భగవద్గీతయొక్క రెం డవ అధ్యాయంలో "సాంఖ్యబుద్ధి" అనే శబ్దానికి నేను "జీవితముయొక్క ఆది భౌతిక సిద్ధాంతములు" అని అర్థం చెపుతున్నాను. మనం ఇప్పుడు జీవితపు మూల సిద్ధాంతాలను గురించి ఆలోచించాలి. కాని దీనికి ముందు సాంఖ్యశబ్ద ప్రసంగంలో వచ్చినటువంటి సాం కేతిక శబ్దాలను గురించికూడ కొంచెం ఇక్కడ చెప్ప వలసి వుంటుంది.

గీతలోని ప్రాచీనమైన విజ్ఞాన పదాలకు కొత్త అర్థాలు కల్పించుకోవడం మామూలు అలవాటు. ప్రాత శబ్దాలమీద క్రొత్త అర్థం అనే అంటుకట్టడం అనేది

అహింసా పద్ధతితో జరిగే భావ విప్లవం. వ్యాసుడు ఈ పద్ధతిలో ఎంతో పొరపగలమనిషి. కనుకనే గీతలో వాడిన శబ్దాలనుంచి ఎప్పటికప్పుడు కొత్త శక్తి వెలువడుతుంది. ఎప్పటికప్పుడు కొత్తవికాసం కనపడుతుంది. కనుకనే అనేకమంది విద్వాంసులు తమతమ అవసరాలు, అనుభవాన్నిబట్టి అనేకమయిన అర్థాలు చెప్పుకోవడానికి వీలయింది. ఈ అర్థాలన్నీ వారి వారి దృక్పథాన్నిబట్టి తిన్నగానే వుంటాయి. ఎవరి అర్థానికీ ఏవిధమైన వ్యాఘాతమూ తగలకుండానే, మనం స్వతంత్రంగా అర్థం చెప్పుకోవడం మంచిది.

ఈ సందర్భంలో ఉపనిషత్తులలో చెప్పిన ఒక సంగతి జ్ఞాపకం వస్తోంది. ఒకసారి దేవతలు, దానవులు, మానవులు కలిసి బ్రహ్మదగ్గర వుపదేశం పొందటానికి వెళ్ళారట. బ్రహ్మదేవుడు అందరికీ కలిపి ఒకే అక్షరం ఇచ్చాడు- "ద". "దేవతలమైన మనం విలాస పురుషులం. భోగాలకు ఎక్కువ అలవాటుపడ్డాం. బ్రహ్మ మనకు "ద" అనే అక్షరం ఇచ్చి "దమనం చెయ్యి" అని నేర్పాడు" అర్థం చెప్పుకున్నారు దేవతలు. రాక్షసులు- "మనం రాక్షసులం. దయాశూన్యులం, క్రోధం ఎక్కువ. కాబట్టి "ద" అక్షరం ఇచ్చి "దయచూపించు" అని నేర్పాడు బ్రహ్మ" అని అనుకున్నారు. ఇక మాన

వులు దానికి ఇంకొక అర్థం తీశారు. "మనుష్యులకు లోభం ఎక్కువ. ధనం ప్రోగుచేయడమంటే మనకు ఎంతో ఇష్టం. కనుక 'ద' అక్షరం ఇచ్చి, బ్రహ్మ 'దానం చెయ్యి' అని చెప్పాడు." అప్పుడు బ్రహ్మ ముగ్గురి అర్థం సరిగానే వున్నదన్నాడు. ఎందుకంటే, ముగ్గురు కూడ ఈ అర్థాలను తమ స్వానుభవం ద్వారానే పొందారు. గీతకు నిర్వచనం చెప్పేటప్పుడు ఉపనిషత్తులో చెప్పిన ఈ సంగతి జ్ఞాపకం వుంచుకోవాలి.

రెండవ అధ్యాయంలో మహత్తరమైన మూడు జీవిత సిద్ధాంతాలు చెప్పబడినాయి- (1) ఆత్మయొక్క అమరత్వం, అఖండత్వం, (2) దేహ క్షుద్రత్వం. (3) స్వధర్మ పాలనము న బాధ్యత.

ఈ మూడుసిద్ధాంతాలలో స్వధర్మపాలనకు చెందిన సిద్ధాంతమే కర్తవ్యం. మిగిలిన రెండు జ్ఞాతవ్యం (తెలుసుకోతగినవి.) మాత్రమే.

స్వధర్మాన్ని గురించి క్రిందటి దఫా కొంత ముచ్చటించాను. ఈ స్వధర్మం మనకు సహజంగానే సంప్రాప్తిస్తుంది. స్వధర్మాన్ని వెతక నక్కరలేదు. మనం ఆకాశంనుంచివూడిపడి ఈభూమిమీదవచ్చి వున్న వాళ్లంకాదు మనం పుట్టకముందుకూడా ఈసంఘం

వుంది. మన తల్లి-దండ్రులువున్నారు. ఇరుగు-పొరుగు వుంది. ఈ పరంపరలోనే మనం పుట్టాం. నన్ను కని పెంచిన నా తల్లి-దండ్రుల సేవ చేయవలసిన ధర్మం నాకు జన్మతోనే లభించింది. ఏ సంఘంలో నేను పుట్టానో ఆ సంఘానికి సేవచేసే అధికారం పొందటానికి నేనేమీ ప్రయాసపడ నక్కరలేదు మన జన్మతోనే మనకు స్వధర్మం పుట్టుకువస్తుంది. ఇంకా తేటగాచెప్ప వలెనంటే, మన జన్మకు ముందే స్వధర్మం మనకు తయారుగా వుంటుందనికూడ చెప్పుకోవచ్చు. ఆధర్మమే మన జన్మకు హేతువు. దానిని పూర్తి చేయటానికే మనం పుట్టాం.

కొంతమంది స్వధర్మాన్ని పత్నీత్వంతో పోలుస్తారు. భార్యాభర్తలకు ఏవిధమైన అవినాభావ సంబంధముస్నదో, అలాగే మన స్వధర్మంకూడ మనకు అవిచ్ఛిన్నమైందంటారు. కాని నాకీ పోలిక అంత సమానమైన వుజ్జీలో కన్పడదు. నేను స్వధర్మాన్ని మాతృత్వంతో పోలుస్తాను. తల్లిని సేవించే ధర్మం నేను ప్రత్యేకంగా వెతకనవసరంలేదు. నేను పుట్టకముందే. అది నా కొరకు ఏర్పడివుంది. ఆమె యెటువంటిదైనా నే నామెను ఏవిధంగాకూడ విడనాడలేను.

స్వధర్మాన్ని గురించికూడ ఇదేచెప్పాలి మనకీ ప్రపంచంలో స్వధర్మాన్ని మించిన ఆశ్రయం ఇంకొకటి

లేదు. స్వధర్మాన్ని తెగనాడడం అంటే, మనయాత్మను నష్టపరచుకోవడమన్నమాట. స్వధర్మాన్ని ఆశ్రయించు కున్నప్పుడే మనము ముందుకు సాగగలుగుతాము. కనుక ఎవరూ ఆ ఆశ్రయాన్ని విడిచి పెట్టకూడదు. ఇది జీవితపుమూల భౌతిక సిద్ధాంతాలలో ఒకటి.

స్వధర్మం సహజంగానే, ఆచరించడానికి మనకు లభించివుంది. కాని ఎన్నో విధములైన మోహాలలో చిక్కి ఆచరించలేక పోతున్నాము. ఒకవేళ ఆచరించినా ఎంతో కష్టపడవలసి వస్తున్నది స్వధర్మ మార్గంలో ముళ్లలాగు ఎన్నో వ్యామోహాలు మనలను అడ్డగిస్తూవుంటాయి. అవి అసంఖ్యాకమైనవి. అయినా విమర్శనా దృష్టితో చూస్తే అన్నిటికీ మూలబీజము ఒక్కటేననితోస్తుంది- అది మమత్వమూను, ఇంద్రియ లోలుపత్యం, "నేను, ఇంకా నా శరీర సంబంధమైన ఆత్మీయులు ఇంతవరకే నా ప్రపంచము అంతకు మిం చినదంతా పరాయి సంబంధము, లేక శత్రువులు" ఇటు వంటి భేదభావాలతో కూడిన గోడలను మధ్యను నిల బెడుతుంది ఈ బుద్ధి. ఎవరిని అది 'నేను' లేక 'నాది' అనుకుంటుందో వాటి విషయమైకూడ బాహ్యాశరీరం మీదనేదాని చూపువుంటుంది. బుద్ధియొక్క ఈ తిక మకల్లోపడి మనం 'నీ' 'నా' అనే చీలికలు యేర్పరుచు

కుంటాము. దాదాపు అందరూ ఈ మార్గాన్నే నడుస్తూ వుంటారు. పోతే కొందరి మార్గం కొంచెం ఔదార్యంగానూ, కొందరిది సంకుచితంగానూ వుండవచ్చు. కాని మార్గమంతా ఒకటే. ఈ శరీర వ్యామోహాన్నిబట్టి మనుష్యుని లోతుకూడ వుంటుంది. కొంతమంది దృష్టి తన కుటుంబాభిమానం వరకే ఆగిపోతుంది. ఇంకా కొంతమందిది దేశాభిమానంవరకు పోతుంది. మరికొందరు బ్రాహ్మణ-బ్రాహ్మణ సమస్యలతో వూగులాడుతూ వుంటే, ఇంకా కొంతమంది హిందూ మహమ్మదీయ కలహాల్లో. ఒకటి రెండుకాదు- ఇలాంటివి ఎన్నో సమస్యలు మనిషికావాలని కోరి తెచ్చుకుంటాడు. ఇలాంటి విభేదాలు లేకపోతే మనము బ్రతకనేలేమేమో అన్నట్లు, జైలులోనైతం రాజకీయ ఖైదీలనీ, ఇతర ఖైదీలనీ, భేదాలను సృష్టించాము. కాని పరిణామమంతా ఒకటే. స్వధర్మమనే ఆరోగ్యతత్వం నశించి హీన వికారాలకు లోనయ్యే పశువులమైనాం.

ఇటువంటి పరిస్థితుల్లో కేవలం ఒక స్వధర్మనిష్ఠయే చాలదు. అందుకొరకు మిగిలిన రెండు సిద్ధాంతాలకూడ దృష్టిలో వుంచుకోవాలి. ఒకటి "నేను" అంటే ఈ నశించే శరీరంకాదు, ఈ శరీరం కేవలం ఆత్మకు ఆవరణవంటిది మాత్రమేననీ, రెండు, నేను

మెన్నడూ నశించని అఖండమైన, విశాలమైన ఆత్మను, అనీ తెలుసుకోవాలి. ఈ రెంటినీ కలుపుకుని అప్పుడు ఒక సంపూర్ణమైన తత్వజ్ఞానము తయారవుతుంది.

ఈ రెండు తత్వాలకూ గీత చాలా మహత్తును ప్రసాదించింది. అందుకే ముందుగా ఈ సిద్ధాంతాలను ప్రవేశ పెట్టి, తర్వాత స్వధర్మాన్ని గూర్చి బోధింపబడ్డది. "ఈ తత్వజ్ఞాన సంబంధమైన శ్లోకాలు ప్రారంభంలోనే ఎందుకు?" అని అడుగుతారు కొందరు. నా దృష్టిలో ఇదియే ఎక్కువ పరిశీలించదగ్గవిషయం. ఈ శ్లోకాలు ఇప్పుడు ఏపద్ధతితో అమర్చబడివున్నాయో, దానిలో ఏ మాత్రమూ మార్పుజరగడానికి అవకాశంలేదు. ఈ క్రమం చాలా సందర్భానుకూలంగా వున్నదని నా అభిప్రాయం.

ఇంత తత్వజ్ఞానం జీర్ణించుకోగలిగితే, స్వధర్మాచరణ ఏమాత్రమూ కష్టతరమనిపించదు. అంతేగాదు, స్వధర్మాన్ని ఆచరించకుండా ఇంకేదైనా చెయ్యడానికి మనసు పోనేపోదు. ఆత్మయొక్క అఖండత్వమూ, దేహపు క్షుద్రత్వమూ తెలుసుకోవడం అంత దుస్సాధ్య విషయంకాదు. అవి రెండూ వాస్తవిక తత్వాలు. కాని వాటిని గురించి పరిశీలించాలి. మాటిమాటికీ మనసులో మననం చేసుకోవాలి. ఈ శరీరంమీది వ్యామోహాన్ని

త్యగించి, ఆత్మయొక్క మహత్తును గుర్తించడం మనం నేర్చుకోవాలి.

ఈ శరీరం క్షణక్షణం మారుతూ వుంటుంది. బాల్యము, యౌవనము, వార్ధక్యము- ఈ మూడు అందరూ చూస్తున్నవే. ఏడేసి సంవత్సరాల కొకసారి శరీరం పూర్తిగా మారిపోతుందనీ, పాతరక్తం ఒకబొట్టు కూడ మిగలదనీ ఇప్పటి శాస్త్రవేత్తలు చెపుతున్నారు. మన పూర్వీకులు 12 సంవత్సరాల కొకసారి పాతశరీరం పూర్తిగా నశించిపోతుందని అనుకునేవారు. కనుకనే ప్రాయశ్చిత్తము, తపస్సు, అధ్యయనము- వీటికి గడువు 12 సంవత్సరాలని నిశ్చయించారు. చాలా కాలంతర్వాత కొడుకు ఇంటికివస్తే తల్లి కొడుకునిగుర్తు కూడ పట్టలేకపోయిందని మనం కొన్నికథలలో వింటూ ఉంటాము. ఈ విధంగా ప్రతిక్షణము మారేటటువంటి,- ప్రతి క్షణము చచ్చేటటువంటి- శరీరం నీరూపం కాగలుగుతుందా? రాత్రింబవలు మలమూత్రాలతో నిండియుండి, నీవంటి శుభ్రపరచేవాడు దొరకినప్పటికీ తన మురికి స్వభావాన్ని వదులుకోలేనటువంటి ఈ శరీరం నీవు కాగలుగుతావా? శరీరం అశుభ్రం- నీవు శుభ్రపరచేవాడివి; అదిరోగి- నీవు మందుతాగించేవాడివి; అది మూడున్నర మూరల భూమిమీద పడివుంటుంది- నీవు

త్రిభువన విహారవి: అది సత్యమూ మార్పుస్వభావము కలది- నీవు దాని మార్పును చూచేవాడివి: అది చచ్చేది- నీవు దాని చావును నియమాను సారం చేయించేవాడివి; నీకూ దానికీ ఇంత భేదం ఉన్నట్లు కన్పిస్తూ వుండగా, నీవు ఇన్ని హద్దులు గీసుకుని ఎందుకు కూర్చుంటావు? కేవలం దేహ సంబంధం ఎందుకు వాంఛిస్తూ వుంటావు? దేహ నాశనాన్నిగురించి వాపోవడం యెందుకు? "దేహ నాశనం శోకించవలసిన విషయమా?" అని భగవంతుడు అడుగుతున్నాడు.

దేహం వస్త్రంలాంటిది. పాతది చిరిగిపోతే కొత్తది వేసుకుంటూవుంటాము. ఒకే శరీరం ఎల్లకాలమూ ఆత్మను ఆవరించుకుని వుంటే ఆత్మకు చాలా ఇబ్బంది కలిగేది. వికాసమంతా ఆగిపోయేది ఆనందం లోపించిపోయేది జ్ఞానప్రభ మందగించేది. కనుక ఈ దేహం దుఃఖించతగ్గదికాదు. ఆత్మ కేగనుక నాశనముంటే తప్పక దుఃఖించవలసిందే దానికి వినాశము లేదు. ఆత్మఅఖండంగా ప్రవహించే ఒకప్రవాహం. దానిమీద ఎన్నో శరీరాలువస్తూవుంటాయి. కనుక దేహసంబంధాలను ఆలోచించుకుంటూ శోకించడంకాని, "వీరు నావారు, వారు పరాయివారు" అని వేరువేరుగిరులు గీసుకోవడం కాని చాల పొరపాటు. బ్రహ్మాండం

అంతా ఒక చక్కగా నేసినటువంటి వస్త్రంలాంటిది. చిన్నపిల్లవాడు చేతిలో క త్తె ర తీసు కు ని గుడ్డను ముక్కలుముక్కలు చేసినట్టు, విశ్వాత్మను దేహమంత పరిమాణంగల ముక్కలుముక్కలుగా చేయడం ఎంతటి తెలివితక్కువ- ఎంతటి హింస?

బ్రహ్మవిద్యకు ఆటపట్టైన ఈ భారతభూమిలో ఇన్ని జాతులు, ఇన్ని పార్టీలుచూస్తే చాలా దుఃఖం వేస్తుంది. చావంటే మనకున్నంత భయం బహుశ మరెక్కడ వుండివుండదు. ఇంతకాలంగా దాస్యజీవితం గడపడం దీనికి ముఖ్యకారణమని చెప్పుకోవచ్చును. అయినా ఈ దాస్యజీవితం రావడానికి కారణముకూడ యీ మృత్యుభయమేనని మనం జ్ఞాపకముంచుకోవాలి.

చావంటే మనకు అమితమైనభయం. చావుపేరు తలవడంకూడ అశుభమంటాము. జ్ఞానదేవుడు ఇది చూచే ఎంతో విచారంతో ఇలా వ్రాయవలసివచ్చింది- "చావనే శబ్దాన్ని కూడ వినలేరు. ఎవరైనా చచ్చిపోతే ఏడుస్తూ వుంటారు." ఎవరైనా చచ్చిపోతే అబ్బ! ఎంత యేడుస్తారు! ఎంత అరుస్తారు! అలా చెయ్యడం ఒక కర్తవ్యంలాగ అయిపోయింది. కూలి ఇచ్చికూడ ఏడిపించే పద్ధతిలోకి వచ్చారు. చావు దగ్గరకు వచ్చినా రోగితో చెప్పరు. డాక్టరు వచ్చి ఈ రోగి

బ్రతకడని చెప్పినప్పటికి రోగిని మభ్యపరచివుంచుతారు. డాక్టరుకూడా స్పష్టంగా చెప్పడు. చచ్చేవరకు మందులు మింగిస్తూనే వుంటాడు. నిజంచెప్పి ఓదార్చి ఈశ్వర ధ్యానం చేయిస్తే అతనికెంత వుపకారం చేయించిన వారవుతారు? కాని వీరికి, గాబరావల్ల సమయం రాక ముందే ఘటమెక్కడ బ్రద్దలౌతుందోనని భయం. సమయానికి ముందే ఘటం బ్రద్దలౌతుందాఅని నాప్రశ్న. ఒకవేళ కాలానికంటె రెండుగంటలు ముందే బ్రద్దలవుతుందనుకోండి. ఇంతలో వచ్చిన నష్టం ఏమిటి? రెండు గంటల తర్వాతైనా బ్రద్దలయిపోయేదేగా! అంటే క్రూర చిత్తులం, ప్రేమశూన్యులం కమ్మనికాదు నా అభిప్రాయం. కాని దేహాసక్తిమాత్రం ప్రేమగాదని చెప్పుతాను. దేహాసక్తి నశించనంతవరకు నిజమైన ప్రేమ కలగనే కలగదు.

దేహాసక్తి నశించినప్పుడు- "ఈ దేహం సేవకు సాధనం" అని మనకు బోధపడుతుంది. అప్పుడే శరీరానికి తగిన గౌరవంకూడ లభిస్తుంది. కాని ఇప్పుడు మనం దేహపూజనే పరమసాధ్యంగా పెట్టుకున్నాం. స్వధర్మాచరణయే మనకు గమ్యస్థానమని మరచిపోయాం. స్వధర్మాచరణకొరకు దేహాన్ని సంబాళించడం, ఇంత తిండివేయడం అవసరం. కాని నాలుకను

తృప్తిపరచడంకాదు గరిటెను హల్వాలో తిప్పండి, లేక బియ్యపు జావలో. రెంటిల్లోనూ ఒకేమాదిరిగా వుంటుంది. వాటి రుచితో దానికేమీ సంబంధంలేదు. అదే స్థితి మన నాలుకకుకూడ కలగాలి. దానికి రసజ్ఞానం కలగవచ్చు. కాని సుఖదుఃఖాలుమాత్రం అంటగూడదు. శరీరానికి ఇవ్వవలసిన బాడుగ ఇచ్చివేశాము- అంతే ఇక సెలవు. రాట్నంతో మనం నూలువడకాలి కాబట్టి దానికి నూనెవేయుడం అవసరం. అదే విధంగా మనం ఈ శరీరాన్ని వుపయోగించుకోవాలి కనుక అందులో ఇంత బొగ్గువెయ్యాలి. దేహాన్ని ఈ విధంగా వుపయోగిస్తే. అసలు దానికి విలువలేకపోయినా ఇప్పుడు కొంత విలువవస్తుంది. కొంత గౌరవంకూడ లభిస్తుంది.

కాని మనం దేహాన్ని సాధనంగా వుపయోగించుకోవడానికిబదులు దానిలోనే మునిగిపోయి ఆత్మవికాసానికి అద్దుతగులుతాము. అందుకనే అసలే విలువలేని ఈ శరీరం ఇంకా విలువలేకుండా పోతుంది కనుకనే సాధుపుంగవులు ఎంతో గట్టిగా వుపదేశిస్తూ వుంటారు- "ఈ దేహాన్నీ, దీన్సంబంధీకుల్నీ నిందించు- తిరస్కరించు మనుష్యేతరమైన కుక్కలకు, పందులకుకూడా నమస్కరించు. దేహాన్నీ, దేహంతో సంబంధం కలవుకున్న చుట్టపక్కాలనీ రాత్రింబవలు పూజిస్తూ కూర్చోవద్దు ఇతరులనుగుర్తించడం- గౌరవించడం నేర్చుకో."

మనం ఈవిధమైన విశాల భావాలు అలవర్చుకోవాలని సాధులు మనకు బోధిస్తున్నారు. కాని ఆత్మీయుల్ని, ఇష్టమిత్రుల్నీ వదలి ఒక్క అంగుళమైన మనం మన ఆత్మను ముందుకు తీసుకు పోవడానికి ప్రయత్నిస్తున్నామా? "మనస్సును మనసులో తిరగపొయ్యి. ఆత్మను ఆత్మలో లీనంచెయ్యి" అనేసూత్రాన్ని ఎప్పుడైనా పరిశీలిస్తున్నామా? మనం ఎప్పుడైన మన ఆత్మహంసను బయట తెరప గాలిలో త్రిప్పడానికి ప్రయత్నిస్తున్నామా? "నేను నా పరిమితి హద్దులుదాటి నిన్న పదిమందితో స్నేహంచేశాను. ఈవేళ పదిమందిని, రేపు యాభై మందిని చేసుకుంటాను. ఇలాగే చేస్తూ చేస్తూ ఒకనాడు సమస్త ప్రపంచం నాలో, నేను సమస్త ప్రపంచంలోనూ ఏకం చేసుకునే పరిస్థితిని కల్పించుకోగలను." అనే విషయాన్ని గురించి ఎప్పుడైనా ఆలోచిస్తామా? ఆకోరికైనా మన మనసులో రేగుతుందా? మనం జైలులోవుండి చుట్టాలకు వుత్తరాలు వ్రాస్తాము. ఇందులో గొప్పతనమేముంది? కాని జైలునుండి విడుదల అయిపోయిన ఎవరైనా క్రొత్త మిత్రులకి (రాజకీయ ఖైదీకికాదు, మామూలుఖైదీకి) వుత్తరం వ్రాస్తామా?

మనఆత్మ అనుక్షణమూ ప్రపంచం అంతటా విరివిగా వ్యాపించడానికి తహతహ పడుతూవుంటుంది.

సమస్త ప్రపంచాన్ని తనదిగా చేసుకోవాలని వువ్విళ్లూరుతూ వుంటుంది. కాని మనం దానిని మూత పెట్టి వుంచుతాము. ఆత్మను మనం ఖైదీగాచేసి అట్టి పెట్టాము. ఈసంగతి మనకెప్పుడూ జ్ఞాపకమైనారాదు. ఉదయం మొదలు సాయంత్రమువరకు దేహసేవయే మనకుముఖ్యం. ఈశరీరము ఎంతపెరిగింది, ఎంతతరిగింది? అనేదే మనంచేసేఆలోచన. ఇంతకంటె మానవుడికి ఇకవేరేఏమీ ఆనందంలేదు కాబోలు.

భోగము, రుచిలోవుండే ఆనందము పశువులు కూడా అనుభవిస్తాయి. కాని సోదరా! త్యాగములోనూ, రుచులు విడనాడిన మీదట కలిగే ఆనందంకూడ నీవు అనుభయిస్తావా అనుభవించవా? స్వయం ఆకలితో వుండి, వడ్డించిన పళ్లెములో ఆకలిగొన్నవాని ముందు పెట్టడంలో వున్న ఆనందాన్ని కూడా అనుభవించు. దాని రుచికూడా చూడు. తన బిడ్డకొరకు రాత్రింబవళ్లు కృశించే తల్లికి త్యాగంలో వున్న మహిమ కొంతవరకు తెలుస్తుంది.

మనిషి "నా" అనే గీటు గీచుకుని, దాంట్లో కూర్చున్నా, అందులో కూడ అతనికి తెలియకుండానే, ఆత్మ వికాసంలో వున్న మజా కొంచెమో గొప్పో అతనికి తగులుతునే వుంటుంది. దేహంలో చుట్టివుంచిన

ఆత్మ ఎప్పుడైనా కాస్సేపు కొంత బయటికి- ముందుకు వస్తుంది. ఈబయటికి రావడం ఎలాగంటారు? చీకటి గదిలో బంధింపబడిన దొంగ కొంచెంసేపు పని చేయడానికి బయటికి వచ్చినట్టు. కాని ఆత్మ ఇంటితో తృప్తి చెందదు. ఆత్మ ముక్తానందం కొరకు దేవు లాడుతూ వుంటుంది.

సాధకుడు జ్ఞాపకముంచుకో దగినవి మూడు విషయాలు- (1) అతనుఅధర్మ, పరధర్మపు, తిరుగుడు మార్గాలువదలి స్వధర్మము యొక్క తేలికైన, తిన్నని మార్గం అవలంబించాలి. స్వధర్మాశ్రయం ఎప్పుడూ వదల కూడదు. (2) దేహము క్షణభంగుర మనుకుని, దానిని స్వధర్మాచరణలో లీనం చెయ్యాలి అవసరంవస్తే అందుకే త్యజించాలి. (3) ఆత్మయొక్క అఖండత్వం, సర్వ వ్యాపకత్వాన్ని ఎప్పుడూ జ్ఞప్తికి తెచ్చుకుంటూ మనసులో నుంచి "నీ" "నా" భేదాల్ని తొలగించాలి. ముఖ్యమైన ఈమూడు జీవిత సిద్ధాంతాల్ని భగవంతుడు బోధిస్తున్నాడు. వీటిని చరితార్థ పరుపగల మనుష్యుడు "నరదేహాన్ని సాధనంగా చేసుకుని, సచ్చిదానంద పదవిని సాధింపవచ్చు" నని తెలుసు కుంటాడు. ఇందులో ఏమీ సందేహం లేదు. భగవంతుడు ఈ సిద్ధాంతాలుమాత్రమే చెప్పి ఫూరుకోలేదు. క్రియాశూన్య

మైన సిద్ధాంతాలు ఎందుకు? భగవద్గీతలో చెప్పిన ఈ సిద్ధాంతాలు ఉపనిషత్తుల్లో, స్మృతుల్లో అదివరకే వున్నాయి. గీత మళ్లీ వాటిని మనకొకసారి జ్ఞాపకం చేసింది. ఇందులో ఏమంత మహిమలేదు. ఆసిద్ధాంతాలను ఎలా వ్యవహరించాలో, ఆచరించడం ఎలాగో బోధించింది గీత. ఈమహత్తరమైన ప్రశ్నను విడదీసి కార్యాచరణ యోగ్యంగా చేయడంలోనే దానిమహత్తు.

జీవిత సిద్ధాంతాలను కార్యాచరణలో పెట్టే యుక్తినే "యోగం" అంటారు. "సాంఖ్య" మంటే సిద్ధాంతము లేక శాస్త్రము. "యోగ" మంటే కళ. "యోగులు జీవితకళను సాధించారు" అనిసాక్ష్యమిస్తున్నాడు జ్ఞానదేవుడు. సాంఖ్యము-యోగము, శాస్త్రము-కళలతో పరిపూర్ణమైవుంది భగవద్గీత. శాస్త్రము-కళమిళితమైనప్పుడు జీవితసౌందర్యం వెల్లివిరుస్తుంది. ఒట్టి శాస్త్రం అంత వుపకరించదు. సంగీత శాస్త్రం అర్థమైనప్పటికీ, గొంతునుంచి సంగీతం వెలిపరచేకళ పరిపక్వం కానంతవరకు నాద బ్రహ్మ రాణించదు. కనుకనే భగవంతుడు సిద్ధాంతంతో పాటుదాని వినియోగపద్ధతిని, నేర్పేకళనుకూడ బోధించాడు. ఈకళ ఏమిటి- దేహము తుచ్ఛమనుకుని, ఆత్మయొక్క అఖండత్వము, అమరత్వమును ధ్యానిస్తూ, స్వధర్మాచరణకు ప్రేరేపించు ఈ ధర్మం ఏమిటి? ఇది మనం తెలుసుకోవాలి.

కర్మ చేసేవారు రెండు విధాల అభిప్రాయాలు కలిగి వుంటారు. "మనం కర్మ చేశాం దాని ఫలితం తప్పక మనం అనుభవిస్తాం. అనుభవించడానికి మనకు హక్కు వుంది" అనుకునేవారిది ఒక తెగ దీనికి వ్యతిరేకంగా "మనం ఫలితం అనుభవించకపోతే, కర్మయే చేయకూడదు" అంటారు మరికొందరు. కాని గీత బోధించేది మూడో మార్గం. "కర్మ తప్పక చెయ్యి. కాని దాని ఫలాధికారం కోరవద్దు. కర్మ చేసేవాడికి ఫలం పొందే అధికారం వుంది. కాని నీవు స్వయంగా విడిచిపెట్టు" అనేది గీతాప్రబోధం. "కర్మను గ్రహిస్తానా, ఫలితంతోసహా గ్రహిస్తాను." అంటుంది రజోగుణం. ఇక తమోగుణం- "వదులు కుంటానా, కర్మతో సహా వదులుకుంటాను" అంటుంది. రెండూ ఒక దాని తోబుట్టువు ఒకటి. రెంటినిదాటి విశుద్ధమైన సత్వ గుణుడవుకాప్రయత్నించు. కర్మ చేసి ఫలితాన్ని విడిచిపెట్టు. ఫలితాన్ని త్యజించి కర్మచెయ్యి. ముందు కానీ, తర్వాతకానీ ఫలాపేక్ష వుంచుకోవద్దు.

ఫలాపేక్ష ఉంచుకో వద్దంటూనే, చేసే కర్మ ఉత్కృష్టమైందిగావుండాలని బోధిస్తుందిభగవద్గీత. అపేక్షతో చేసిన కర్మకంటె నిరపేక్షతో చేసిన కర్మ ఇంకా బాగాఉండాలని కోరడం సబబే. కారణమేమంటే, ఫలా

పేక్షతో చేసే మనిషి ఫలసంబంధమైన స్వప్నాలు చూస్తూ వుంటాడు. ఆ ఆలోచనలో కొంత సమయం, కొంత శక్తి తప్పక వ్యయమవుతుంది. కాని ఫలాపేక్ష లేని మనిషి తన ప్రతి క్షణాన్నీ, ప్రతి శక్తినీ కర్మ చేయడంలో వినియోగిస్తాడు. నది ఎన్నడూ విశ్రాంతి తీసుకోదు. గాలికి ఎన్నడూ శెలవు అవసరం లేదు. సూర్యుడు అనుక్షణమూ తపించడమే ఎరుగు. అదే విధంగా నిష్కామ కర్మోపాసకుడు రాత్రింబగలు ఒక్క కర్మను గురించే ఆలోచిస్తాడు. ఇంత నిష్ఠతో చేసిన వానిపని బాగుండక, ఇంకా ఎవరి పని బాగుంటుంది?

ఇదీ కాక మనస్సులోని సమభావం కూడ ఒక గొప్పకళ. నిష్కామ పురుషుడు ఈభావాన్ని తొందరగా పొందగలడు. ఏదైనా మామూలు చిత్ర కళను తీసుకోండి. హస్త చాతుర్యంతోపాటు అందులో చిత్త సామ్యంకూడ కలిస్తే ఆపని ఎంతో చక్కగా వుంటుందని చెప్పడానికి ఏమీ సందేహము లేదు. ఫలాపేక్షగల మనిషి చేసే కర్మలోనూ, ఫలాపేక్ష లేనివాని కర్మలోనూ ఎంతో తారతమ్యం వుంటుంది. ఆతారతమ్యం ఫలాపేక్ష లేనివాని కర్మకు ఎక్కువ ఉపకరిస్తుంది. ఫలాపేక్షకునిచూపు ఎప్పుడూ "కర్మ నాదే, ఫలితమూనాదే" అనే స్వార్థంతో నిండివుంటుంది కనుక కర్మలోఏదైనా

పొరపాటు వచ్చినా, దానినంతగా అతను పాటించడు. ఏదో వ్యవహార దోషముందిలే అనుకుంటాడు. కాని నిష్కామ పురుషుడు అలాకాదు. కర్మ విషయంలో అతను నైతికంగా కర్తవ్య బుద్ధి కలిగి వుంటాడు. తను చేసే పనిలో ఏవిధమైన లోటూ రాకూడదని నిత్యమూ జాగరూకత కలిగి వుంటాడు. అందువల్ల అతని పని ఎప్పుడూ నిర్దోషంగా వుంటుంది. ఏదృష్టితో నైనా చూడండి, ఫలత్యాగం ఎంతో నేర్పరి తనం, సాఫల్యంతో కూడుకున్న తత్వమని బోధపడక పోదు. కనుక ఫలత్యాగాన్ని 'యోగం' అని కాని 'జీవితకళ' అని కాని చెప్పాలి.

కొంచెంసేపు నిష్కామకర్మను అలా విడిచి పెట్టి, ప్రత్యక్ష కర్మను గురించే ఆలోచిద్దాం. అట్లా గయిన కర్మలోవున్నంత ఆనందం, ఫలంలో కనపడదు. స్వకర్మ చేస్తూ వుంటే మనకు కలిగే తల్లీనతయే మన ఆనందానికి మూలస్రోతస్సు. చిత్రకారుడి దగ్గరకు పోయి- "సోదరా, నీవు బొమ్మలు గీయటం మాని వెయ్యి అందుకు ప్రత్యామ్నాయంగా నీవు ఏది కోరితే అది ఇస్తాను" అని అనండి. అతను తనపని విర మించుకోలేడు. అలాగే రైతుదగ్గరకు వెళ్ళి- "నీవు పొలం వెళ్ళకు. ఆవుల్ని మేపకు. మోటతోలకు. నీకు

కావలసిన ధాన్యం నావద్ద పట్టుకుపో” అని అనండి. అతను నిజమైన రైతే గనుక అయితే, మీ మాటలు అతనికి రుచించవు. రైతు ఉదయం లేచి పొలం వెళ్లి తూవుంటే సూర్యదేవుడు అతనికి స్వాగతమిస్తాడు. పక్షులు అతనికి పాటలు వినిపిస్తాయి. ఆవులు, లేగలూ అతనిచుట్టూ గుమికూడి, అతని శరీరాన్ని నాకుతాయి. అతను వాటితో ఆడుకుంటాడు. మొక్కలను చేతితో సవరించుతాడు. వీటన్నిటిలోనూ అతనికొక సాత్విక ఆనందం లభిస్తుంది. ఈ ఆనందమే అతని కర్మకు నిజమైన ఫలితం. దాని ముందు, దాని భౌతిక ఫలం నగణ్యం.

గీత ఫలాసక్తికూడదని చెప్పడంచేత, కర్మలో నూరురెట్లు తన్మయత్వాన్ని పెంచిందవుతోంది. ఫలాపేక్ష లేనివానికి కర్మఅంటే, సమాధిలో నిమగ్నమైనంత తన్మయత్వం కలుగుతుంది. అతను కర్మలో ఇతరులకంటె నూరురెట్లెక్కువ ఆనందం అనుభవిస్తాడు. ఈ దృష్టితో నిష్కామకర్మ స్వయంగానే ఒక గొప్ప ఫలం. “చెట్లకు కాయలుకాస్తవి. కాని కాయలకు ఇంకే విధమైన కాయలుకాస్తాయి?” అని ప్రశ్నించాడు జ్ఞానదేవుడు. ఈ దేహమనే చెట్టుకు నిష్కామ స్వధర్మాచరణమువంటి అందమైన కాయకాచిన తర్వాత, ఇంకా ఏవో ఇతరమైన ఫలాలను గురించిన అపేక్ష ఎందుకు

పడాలి? రైతు పొలంలో గోధుమలు పండించి వాటి నమ్మి, కొన్నరొట్టె ఎందుకు తినాలి? సారవంతమైన రుచిగల అరటితోటవేసుకుని, దానికోని అరటిపళ్ళు అమ్మి మిరపకాయలకారము ఎందుకు తినాలి? సోదరా! ఆ అరటిపళ్ళే తిను కాని పరిహాసమువాయము ఇం మకు ఇష్టపడడు అరటిపండ్లు తినే అవకాశమున్నప్ప టికీ ప్రజలు మిరపకాయలే తింటాఉంటారు. "అలా చేయనద్దు కర్మనే తిను, కర్మనే త్రాగు, కర్మనే జీర్ణిం చుకో" అని చెపుతుంది భగవద్గీత. కర్మచేయడంలోనే అంతా ఇమిడి వుంటుంది. పిల్లవాడు ఆటలాడడం ఆనం దం కొరకే. అతనికి దానివలన ఫలితం కలుగుతుందని తెలియదు. అతని ఆనందము, అతని చూపు అంతా ఆటమీదనే వుంటుంది. కనుకనే వ్యాయామ ఫలితం అత నికి అనాయాసంగా లభిస్తుంది.

సాధుపురుషులు తమ జీవితంద్వారా ఇటువంటి దృష్టాంతాలు చూపించారు. తుకారాముని భక్తి చూచి, శివాజీకి మనస్సులో ఆయనంటే ఎంతో గౌరవముండేది. ఒకసారి అయిన తుకారాముని తీసుకురావడానికి పల్లకీ పంపించాడు. ఆయన స్వాగతానికి ఇంకా ఎన్నో ఏర్పాట్లు మొదలుపెట్టాడు. కాని తనకోసరం చేసే ఈ అట్టహాసంచూచి తుకారాముకు చాలా దుఃఖంకలిగింది.

"ఇదేనా నాభక్తికి ఫలితం? ఇందుకొరకేనా నేను భగవంతుణ్ణి ప్రార్థించేది?" అని ఆలోచించ నారంభించాడు. ఆదర సత్కారాలు అనే ఫలం ఆయన చేతిలోపెట్టి, ఆయన్ని దూరంగా వెళ్లగొడదామనుకుంటున్నాడా భగవంతుడు? అన్నట్టుగా ఆయనకు కనిపించింది. అప్పుడు- "ఓ దయామయుడా! నీ యీ అలవాటు మంచిదికాదు. నాకు ఇటువంటి లంచంపెట్టి నన్ను దూరంగా వెళ్లగొడదామనుకుంటున్నా వనుకుంటాను. బహుశా ఈ తద్దిన వాకిలిముందునుంచి తొలిగితే చాలురా అని అనుకుంటున్నావేమో, కాని నేను అంత తెలివితక్కువవాడనుకాను. నేను నీ కాళ్ళు పట్టుకుని వదలనుగా." అన్నాడు తుకారాం. భక్తియే భక్తుని స్వధర్మం. అందులో అవాంతర ఫలాలనిచ్చే చిలపకొమ్మలను బయటకు రానీయకుండా చూసూఉండడమే అతని జీవితకళ.

పుండలీకుని ఆచరణ ఫలత్యాగానికి ఇంతకంటే ఎంతో గొప్పదైన దృష్టాంతరం చూపుతుంది. పుండలీకుడు తల్లి-దండ్రులను సేవిస్తూ ఉండేవాడు. ఆ సేవను చూచి ప్రసన్నచిత్తుడై పాండురంగడు అతనికి దర్శనమివ్వడానికి పరుగెత్తుకువచ్చాడు. కాని పాండురంగడు వచ్చాడనే సంబరంలో తనచేతిలోవున్న సేవాకార్యాన్ని వదులుకోవడం అతనికి ఇష్టం లేకపోయింది. తల్లిదం

ద్రుల సేవయే అతనికి అన్నిటికంటె మించిన యీశ్వర భక్తి. ఎవరైన ఒక యువకుడు ఇతరులను దోచుకు వచ్చి తన తల్లిదండ్రులను సుఖపెడతాడనుకోండి. లేక ఎవరైనా ఒక దేశసేవకుడు ఇతర దేశాలను మోస గించి తన దేశాన్ని బాగుపరుచుకుందామను కుంటాడ నుకోండి. అప్పుడు ఆయిద్దరిది భక్తికాదు- ఆసక్తిమా త్రమే. పుండలీకునికి అటువంటి ఆసక్తిలేదు. ఎదు టికివచ్చి నిలబడిన ఆభగవంతుని విగ్రహమేనా భగ వంతుడు? ఆ విగ్రహాన్ని దర్శించక ముందు ఈ సృష్టిలేదా?

అప్పుడు పుండలీకుడు భగవంతునితో ఇలా అన్నాడు- "ఓ ప్రభూ, నీవు నాకు దర్శనమిచ్చావని నాకు తెలుసు. కాని నాకు "కూడ" సిద్ధాంతంలో ఎక్కువ విశ్వాసం వుంది. నీవే' దేవతవు అని నేను ఒప్పుకోను. నీవు 'కూడా' దేవతవు ఈ నాతల్లిదండ్రులు 'కూడ' దేవతలే వీరి పరిచర్య పూర్తికానంతవరకు నేను నీ వైపుకు మరల లేను. ఇందుకు నన్ను మన్నించాలి." ఇలా అంటూ, భగవంతుడు నిలబడడానికని అతను ఒక ఇటుకముక్క తెచ్చి అతనిముందు పెట్టాడు. మళ్లీ యధాప్రకారం తనతల్లిదండ్రుల పరిచర్యలో మునిగి పోయినాడు. "ఏమోయి పుండలీకా! నీకు ఇంతమై మరపా! భగవంతునికూడ నిలబెట్టినావే ఒక యిటుక

ముక్క వెనక్కుపారవేసి ఇంత నిర్లక్ష్యం చూపుతావ టోయి భగవంతునిమీద?" అని నవ్వుతాడు తుకారాం ప్రేమతోకూడుకున్న ఎగతాళితో.

ఒకసారి ఒక గృహస్థుడు ఒక సాధువు దగ్గరకు వెళ్ళి- "ఏమండీ, మోక్షంకొరకు ఇల్లూవాకిలి విడిచి పెట్టుకోవలసిందేనా?" అని అడిగాడు. "ఎవరంటారు? జనకునివంటివారు రాజగృహాల్లోవుండి ముక్తినిసాధించ లేదూ? అటువంటప్పుడు నీవు ఇల్లువిడిచిపెట్టవలసినంత అవసరం? అన్నాడు సాధువు.

ఇంకా కొంతసేపటికి మరొక గృహస్తుడువెళ్ళి ఆ సాధుపుంగవుని ప్రశ్నించాడు- "అయ్యా, ఇల్లువాకిలి విడనాడకుండాకూడ మోక్షాన్ని సాధించవచ్చా?" అప్పుడు సాధువు- "ఎవరంటారు? ఇల్లువాకిలితో అంటిపెట్టుకు కూర్చున్నా తేలికలో మోక్షం లభిస్తే, శుక్రాచార్యుల వంటివారు అంత తెలివితక్కువవారా ఇల్లువాకిలి ఒదిలి పెట్టడానికి?" అన్నాడు.

కొంతసేపటికి ఆ ఇద్దరు గృహస్థులు ఒకచోట కలుసుకున్నారు. ఇద్దరిమధ్య వాదవివాదం పెచ్చయి పోయింది. "సాధువు ఇల్లువాకిలి వదల నవసరంలేద న్నాడు" అన్నాడు ఒకాయన. 'లేదు, ఇల్లువాకిలి వదల

కుండా వీల్లేదన్నాడు' అన్నాడు రెండవ గృహస్థు. ఇద్దరు కలిసి సాధువుదగ్గరకు వచ్చారు. అప్పుడు సాధువు ఇలా అన్నాడు- "ఇద్దరిదీ బాగానేవుంది. ఎవరి భావాన్నిబట్టి వారికి బోధించాలి. ఎవరు ఏలాంటి ప్రశ్న వేస్తే వారికి అలాంటి జవాబువస్తుంది. ఇల్లువదలిపెట్ట నవసరంలేదు, ఇదికూడ నిజమే. ఇల్లు వదలిపెట్టి తీరాలి, ఇదికూడ యధార్థమే." దీనినే 'కూడ' సిద్ధాంత మంటారు.

ఫలత్యాగం ఎంతవరకు ఆచరణీయమో పుండలీకుని దృష్టాంతంవల్ల తెలుసుకోవచ్చు. తుకారాము నికి లంచంబెట్టే దృష్టాంతంకంటె, పుండలీకునికి లంచం పెట్టబోతున్న పరిస్థితి ఎక్కువ వ్యామోహంతో కూడి వుంది. కాని అతను భగవంతునివలలో చిక్కనేలేదు. చిక్కుకుంటే మాత్రం మోసపొయ్యేవాడు. ఒకసారి మార్గం నిశ్చయించుకున్నతర్వాత, చివరివరకు దాన్ని వదలకూడదు. మధ్యలో దేవుడు దర్శనమిచ్చి అంత రాయం కలిగించబోతున్నా, ఏవిధంగానూ మనం మార్గం తప్పవలసిన పరిస్థితుల్ని రానీయకూడదు. మన శరీరం ఇంకా మిగిలివుందంటే దాన్ని సాధించడానికేనని అను కోవాలి. దేవతాదర్శనం మనచేతిలోనిపని. అదెక్కడికి పోతుంది? నా సర్వాత్మకత్వమును ఎవడు లాక్కో గలుగుతాడు? మనస్సులో భక్తి- అనగా వుల్లాసంవుంది.

ఆ ఉల్లాసాన్ని పూర్తిచేయడానికే ఈ జన్మ. "మాతే సంగోస్త్వ కర్మణి" అనే ఈ గీతా ప్రవచనానికి అర్థం- "నిష్కామ కర్మచేస్తూ అకర్మ, అంటే కర్మ ముక్తి. లేక మోక్షాన్ని గురించికూడ కోరిక పెట్టుకోవద్దు" అనే అంతవరకు పోయింది. కోరికల్ని త్రెంచుకోవడమే మోక్షం. మోక్షానికి కోరిక లేముంటాయి ఇంకా? ఫల త్యాగం ఈ మెట్టువరకు చేరుకున్నప్పుడు మానవుడు సంపూర్ణమైన జీవితకళను, అంటే పూర్ణచంద్రుని పొందుతాడన్నమాట.

శాస్త్రాన్నిగురించి వర్ణించబడింది. కళనుగురించి చెప్పబడింది. కాని ఇంత మాత్రంచేత పూర్తి దృశ్యం కళ్లముందుకు రాలేదు. శాస్త్రం నిర్గుణం. కళ సగుణం. అయినా సగుణంకూడ ఆకరము తాల్చేవరకు స్పష్ట పడదు. కేవలం నిర్గుణం ఏవిధంగా గాలిమేడల్లాగ వుంటుందో, అలాగేవుంటుంది రూపాన్ని పొందని సగుణంకూడాను. గుణము మన హృదయంలో హత్తుకు పోవాలంటే, ఆ గుణి(మూలస్వరూపాన్ని)ని మనం దర్శించాలి. దృష్టాంతంలేకుండా సగుణరూపంకూడ మనకు సరిగా అర్థంకాదు. కనుకనే అర్జునుడు ఇలా అంటాడు- "భగవంతుడా! నీవు ముఖ్యమైన జీవిత సిద్ధాంతాలు చెప్పావు. వాటిని ఆచరించడానికి తగిన కళకూడ నేర్పావు. అయినా నాకు ఇంతవరకు పూర్తిగా

చిక్కువిడలేదు. కనుక నాకు ఇప్పుడు ఏదైనా ఒక దృష్టాంతం వినిపించు. మనసులో పూర్తి సాంఖ్య నిష్ఠను ఏర్పరుచుకుని ఫలత్యాగమనే యోగమును తనలో జీర్ణించుకున్న మహాపురుషుని లక్షణాలెట్టివో తెలుపు. ఫలత్యాగపు చివరిమెట్టుకు చేరుకున్నవాడు, కర్మ సమాధిలో నిమగ్నుడు, తానుచేసిన నిశ్చయంలో మహామేరువు- అంటే స్థితప్రజ్ఞుడనిపించుకో తగిన వ్యక్తి ఎలా మాటలాడుతాడో, ఎలా కూర్చుంటాడో, ఎలా మెలగుతాడో నాకు బోధించు. ఆ రూపం ఎలా వుంటుంది? అతనిని గుర్తించేదెలాగో, ప్రభూ! నాకు తెలియజెప్పు"

అప్పుడు భగవంతుడు రెండో అధ్యాయపు చివరి పదునెనిమిది శ్లోకాల్లో స్థితప్రజ్ఞుని ప్రవర్తన ఎంత గంభీరము, ఎంత ఉదాత్తముగా వుంటుందో వివరించాడు. ఈ పదునెనిమిదిశ్లోకాల్లో నిజంగా గీతయొక్క పదునెనిమిది అధ్యాయముల సారమంతా ఇమిడివుంది. స్థితప్రజ్ఞుని లక్షణాలు చెప్పడమే భగవద్గీతకు ముఖ్యోద్దేశ్యం. ఆ శబ్దంకూడ భగవద్గీతయొక్క స్వయంసృష్టి. ముందుకు పోయి, ఇదేవిధంగా ఐయిదవ అధ్యాయంలో జీవన్ముక్తునిగురించి, పన్నెండవ అధ్యాయంలో భక్తుని గురించి, పదునాల్గవ అధ్యాయంలో గుణాతీతునిగురించి, పదునెనిమిదవ అధ్యాయంలో జ్ఞాననిష్ఠను గురించి

వర్ణించబడింది. కాని ఈ అన్నిటికంటె స్థితప్రజ్ఞుని గురించి ఎక్కువ విస్తారంగానూ, స్పష్టంగానూ వర్ణించబడింది. అందులో సిద్ధిపొందినవాని లక్షణాలతోపాటు, సాధక లక్షణాలుకూడ తెలుపబడినాయి. వేలకొలది సత్యాగ్రహులు- స్త్రీపురుషులు- సాయంత్రపు ప్రార్థనలో ఈ లక్షణాలు పఠిస్తూ వుంటారు. వీటిని గనుక ప్రతి వూరూ, ప్రతిఇంటికీ అందచేయకలిగితే ఎంత ఆనందం కలుగుతుంది? కాని వాటినిగురించి మనకు పూర్తి విశ్వాసం కలిగినప్పుడుగదా, ఇతరులకు అందజేసేది? రోజు వల్లించేవస్తువు కేవలం పాటగా తయారయితే అది మనసులో నాటుకుపోవడానికి బదులు నశించిపోతుంది. రోజు వల్లించడం పొరపాటుకాదు. కాని వల్లించినవాటిని మననం చేసుకోకపోతే మాత్రం ఏమీ లాభంలేదు. నిత్యపఠనంతోపాటు, నిత్య మననం, నిత్య ఆత్మ పరీక్షఅవసరం.

స్థితప్రజ్ఞుడంటే, స్థిరమైనబుద్ధికలవాడన్న మాట. ఈ సంగతి అతనిపేరే చెప్తోంది. కాని నిగ్రహం లేనిదే బుద్ధి ఎలా స్థిరంగావుండకలుగుతుంది? కనుక స్థితప్రజ్ఞుని నిగ్రహశక్తి సంపన్నుడుగా వర్ణించబడింది. అంతర్బాహ్య ఇంద్రియాలు బుద్ధికి అధీనం కావడం, బుద్ధి ఆత్మకు అధీనం అయివుండడం- ఇదే నిగ్రహమంటే అర్థం. స్థితప్రజ్ఞుడు తన ఇంద్రియాలన

గుప్పెట్లో పెట్టుకుని, వాటిని కర్మయోగంలో లీనపరు స్తాడు. ఇంద్రియాలనే ఎడ్లతో అతను స్వధర్మాచరణ మనే పొలం క్రమపద్ధతిన దున్నుతాడు. అతను తన ప్రతి చిన్నచిన్నశక్తిని పరమార్థంకొరకు వినియోగ పరుస్తాడు.

ఈ ఇంద్రియనిగ్రహం తేలికపనికాదు. ఇంద్రియాలకు ఏమీపనిలేకుండా చేయడం తేలికయే. మౌనము, నిరాహారము అంతకష్టతరమైనవికావు. అంతకంటె తేలికపని ఇంద్రియాలను స్వేచ్ఛగా వదలిపెట్టడం. విపత్తు కనపడినప్పుడు అంగాలనన్నిటిని ముడుచుకుని, ఏమీ విపత్తులేదనుకున్నప్పుడు ఇంద్రియాలను ఉపయోగించుకునే తాబేటివలె, విషయవిలాసాల్లోనుంచి ఇంద్రియాలను నిగ్రహించడం, పారమార్థిక కార్యాలలో వాటిని వుపయోగించడం. ఈ నిగ్రహం చాలా కష్టసాధ్యం. అందుకు చాలా గొప్ప సాధనకావాలి. తగిన జ్ఞానంకూడ అవసరం. ఇంతచేసినా అదిపూర్తిగా చేజిక్కుతుందని చెప్పడానికి వీలులేదు. అందుకని మనం నిరాశపడదామా? వద్దు. సాధకుడెన్నడూ నిరాశ పడకూడదు. అతను తన యావత్తు సాధకయుక్తిని ఉపయోగించి, ఇంకా లోటువుంటే భక్తినికూడ కలుపుకోవాలి.

స్థితప్రజ్ఞుని లక్షణాలు చెపుతూ దీన్నికూడ సూచించాడు భగవంతుడు. ఈ సూచన చాలక్లుప్తంగ వుంది. కాని పెద్దపెద్ద వుపన్యాసాలకంటె దీనికి ఎక్కువ విలువవుంది. ఎందుకంటే, భక్తి ఎక్కడ ఎక్కువ అవసరం అనిపించిందో అక్కడే అది చేర్చబడింది. స్థితప్రజ్ఞుని లక్షణాలను గురించి ఇక్కడ అధికంగా చెప్ప తలచలేదు. కాని మనసాధనలో భక్తికి వున్న ఈ స్థానాన్ని మనం మరచిపోకూడదు. కాబట్టి వాటిని గురించి కొంచెంగా ఇక్కడ చెప్పాను. ఈ ప్రపంచంలో పూర్ణస్థితప్రజ్ఞుడు ఎవరున్నారో భగవంతునికే తెలియాలి. కాని సేవా పరాయణుడైన స్థితప్రజ్ఞునికి దృష్టాంతంగా పుండలీకుని విగ్రహం నాకళ్లయెదుట ఎప్పుడూ మెలుగుతూ వుంటుంది. ఆయన్ని గురించి పైన చెప్పాను.

స్థితప్రజ్ఞుని లక్షణాలు మనం తెలుసుకున్నాం. రెండవ అధ్యాయం పూర్తి అయింది.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---